# శ్రీ జానకీశపథము



శ్రీమతి పోతుకూచి సుబ్బలక్ష్మమ్మచే
రచియింపఁబడినది.



1937.

కాపీరైటు] [ వెల 0—8—0

రామచంద్రపురమున
శ్రీ ఆనంద తీర్థ ముద్రాక్షరశాల యందు
ముద్రితము.

# శ్రీ జానకీ శపథము.



## ప్రథమ ప్రకరణము



శ్రీరామచంద్రుఁడు త్రేతాయుగమున పట్టాభిషిక్తుఁడైన యనంతరము ప్రతిదినము పూర్వభాగమున ధర్మకార్యములు రాజకీయవ్యాపారములు యథావిధిగ నడపి, మిగిలిన కాలము తనయుద్యానవనమున సురతనూజనుబోలు ధరణీకుమారితో విహరించుచు, రాత్రింబవళ్ళు సర్వసుఖముల ననుభవించుచుండెను. జానకియు నీకాలపు నవనాగరికపు స్త్రీలవలెఁగాక మహాచక్రవర్తి భార్యయైనను సూర్యోదయాత్పూర్వమే లేచి భర్తకునమస్కరించి యాతని పరిచర్యలను స్వయముగఁ దానే చేసి, మొగమునిండ పసుపురాచికొని స్నానమాచరించి కుంకుమను ధరించి, కాటుకఁదిద్దికొని పట్టువస్త్రములు ధరించి, స్వర్ణాభరణ భూషితయై దేవకార్యముల సలిపి, దినచర్యముగిసిన పిదప శ్రీరామునితోఁగలసి యుద్యానవనమునకుఁ బోవు

ముఁడు, "భద్రా, ప్రజాపరిపాలన మొనర్చు రాజు తన్ను గురించి లోకులేమనుకొన్నది పరీక్షించుచుండవలెను. నాపరిపాలనను గూర్చియు నితరవిషయములఁగూర్చియు నాప్రజ లేమనుకొను చున్నా"రని యాతనిని ప్రశ్నింప నాతఁడు శ్రీరామునికి నమస్కరించి, "దేవా, శిష్టరక్షకులును దుష్టశిక్షకులును నగు దేవర రాజ్యపాలనఁజేయుచుండఁ బ్రజలు గుండెలపైఁ జేయివైచుకొని హాయిగ నిదురించుచున్నారు. ఎచటఁజూచినను రామనామ స్మరణమే"యన శ్రీరాముఁడాతనిఁజూచి, "భద్రా, యీస్తుతి వాక్యముల కేమిగాని, నేఁడునినుఁజూచిన నేదియోవిశేషవార్త ను వినియున్నట్లు దోఁచుచున్న"దనిన భద్రుఁడు శ్రీరామునిఁజూచి, "దేవా, ప్రజలు కఠినుఁడైన మహారాజునుజూచి హింసాపరుఁడందురు. కరుణార్ద్రహృదయుఁడగు భూపతిని జూచిన భీరుఁడందురు. లోకులు కాకులుగదా! ఎవరో మూర్ఖులును దాగుబోతులును బలికినపలుకులకేమి? ప్రజలందఱును దేవర పాలనమున సమస్తసౌఖ్యము ననుభవించుచున్నారు." "భద్రా లోకుల వాక్యంబుల నెవ్వరును లేనిసమయమున హితుఁడవయ్యు నాకెఱింగించుటకు భయపడుచుంటివేమి? జనులమేలును, గీడును, దెలిసికొనగాదె, కీడులనుఁబోకార్చి వారికి శుభంబులుగూర్చుట?" యన, భద్రుండు, దీనాననుండై "రామచంద్రా! యేమని విన్నవింతును. రాముఁడెట్టిఘనకార్యములు చేసిననేమి? బలవంతముగ దేవద్వేషిస్వాంకమునఁజేర్చి కొనిపోయి లంకలో నశోకవాటి యందుంచిన పొలఁతినిఁదెచ్చి యేలుచున్నాఁడు కాముకులకుఁ

బ్రిపంచమునఁ గన్నులుండవు. 'యథారాజా తథాప్రజా' యను న్యాయ ప్రజలు రాజుననుసరింతురు. రాజువలె మనముఁగూడ నాత్మసతుల నిట్టిపట్లు సహించియుండవలెను" అనువాక్యంబులు నీచుఁడైన యొకరజకునినోటినుండి వాఁడు భార్యనుఁగొట్టుచుఁ బలికిన వింటిననిభద్రుఁడుపలికిన యాపలుకులు శ్రీరామ చంద్రునకు ములుకులై నంతఁ గొంతతడవు నిశ్చేష్టితుఁడై యెట్ట కేలకు ధైర్యము తెచ్చుకొని తదనంతరకార్యంబు నిశ్చయించి భద్రునిఁజూచి "లక్ష్మణ భరత శత్రుఘ్నులనుఁ దోడ్కొనిర" మ్మని యాజ్ఞాపింపఁగా భద్రుఁడు లక్ష్మణుని మందిరంబునకుఁ జని "రామచంద్రుఁడు మిమ్ముర మ్మనె"నని విన్నవించి, వెంటనే భరతశత్రుఘ్నుల మందిరంబులకుఁ జనెను.

శ్రీరామచంద్రుఁడు విచార సముద్రమున మునిఁగి దరిఁ గానక "హా! సీతా! నీవు నేఁడెట్టి కర్ణకఠోరమైన వార్త వింటివి యిట్టివార్త విన్న నాహృదయము బ్రద్దలుగాకున్న దేమి? కఠిన పాషాణమాయేమి? వనజభవుఁడు దానిని శిలలతో నిర్మించెనా? మహాసాధ్వీ! యిట్టినింద? నిన్నగ్నిప్రవేశము చేయించునాఁ డనలుఁడు సాక్ష్యమీయ దేవతలందఱుచే మహాపతివ్రత యని పొగడఁబడితివి. అగ్నికిఁజెదపట్టునా? ఏమిచేయుదును? లోకాప వాదాపహరణార్థము నాప్రాణేశ్వరిని విడనాడుదునా? అపయ శము భరింతునా? సత్యశీలముగల భాస్కరాన్వయంబున నేనేల జన్మించితిని? జన్మించిననేమి? లోకనిందుఁడనైతినిగదా? భూ నాథుఁడే భోగములనాశించి యపవాదముతో రాజ్యమేలినఁ

ప్రజలు ధర్మముతప్పుట సందియమా? నేను సీతనువిడనాడకున్న స్త్రీలు పరగృహమందుండిజానకిని సాటిచెప్పఁగలరు. ఏమిచేయుదును? పితృవాక్యపరిపాలనకు నేను ఘోరారణ్యంబులఁ కేఁగ నన్నువిడువలేక నాతోవచ్చెను. అడవియందన్నపానములులేక యెల్లపుడు నాసేవఁజేసెను. అట్టిప్రాణేశ్వరినివిడనాడి నేనీశోకము నెట్లుభరింతును? ఆదైవము మాపైన దయలేనివాఁడై తిరిగి మమ్ము దుఃఖసముద్రమున ముంచెను. భార్యపైఁగలప్రేమచేఁ బౌరుషము విడిచితినన్నమాట నేఁడు వింటిని. భాస్కరవంశమందుఁ బుట్టిననేను సీతనిందింపఁబడినదని బరిత్యజింతునా? లోకాపవాదము భరింతునా? దైవమా! సౌఖ్యశీలుఁడగు నిరుపేదనై పుట్టక నేనేల పాపిష్ఠిరాజవంశమున జన్మించితిని? దానికై వగచినఁ బ్రయోజనములేదు. నాఁడు రావణునిచేతఁ గొనిపోఁబడినసీతనగ్నిసాక్షిగఁదెచ్చినట్లు నేఁడులోకాపవాదముఁ బోవ నేను సీతను పరిత్యజించిన నదృష్టమున్న నేనాఁటికైన దుర్యశము పోయి తిరిగి నన్నుఁ జేరఁగలదు. నేను సీతనుదప్పక వనవాసమునకుఁ బంపెదనని తలపోయుచుండగా లక్ష్మణభరతశత్రుఘ్నులు వచ్చిరని ద్వారపాలకులు విన్నవింపఁగా శ్రీరాముఁడు తమ్ములువచ్చిరనివిని వ్యాకులచిత్తంబున ద్వారపాలకులతో వారలను లోనికిరానాజ్ఞాపింపఁగా లక్ష్మణభరతశత్రుఘ్నులు ప్రవేశించి రాహుగ్రస్తసుధాంశుఁడోయన మేఘాచ్ఛాదిత మార్తాండుఁడోయన ఘనతరకాంతినిగోల్పోయి బాష్పనయనుఁడైన యగ్రజునిఁజూచి, నమస్కరించిన, రామ

చంద్రుఁడు విచారపూరితుఁడై తమ్ములను గౌగలించుకొని, యుచితాసనములఁ గూర్చుండఁజేసి, "సహోదరులారా! నా ప్రాణములు మీరు. నాధనములు మీరు. సకలశాస్త్రప్రవీణు లగు ధీరులుమీరు. మదాజ్ఞాపాలకులరు గావున నేనాజ్ఞాపించు కార్యము మీరుకాదనక చేయవలయు"నన లక్ష్మణభరత శత్రుఘ్నులు శ్రీరాముఁడేమియాజ్ఞాపించునోయని యాశ్చర్య మనస్కులై యెదురుజూచుచుండ శ్రీరాముఁడు దీనాననుండై తమ్ములనుజూచి "సోదరులారా! మీతో నేనేమనిచెప్పుదును? పృథ్వీశనూజనుగూర్చి ప్రజలు సర్వప్రదేశములందును వినరాని వాక్యములు పలుకుచున్నారని భద్రుఁడుచెప్ప నేనువిన్నది మొదలుకొని నాహృదయము బ్రద్దలగుచున్నది. కర్ణకఠోరము లగు నట్టినిందావాక్యములను మీతో నేనెట్లుచెప్పుదు"నను రామునివచనంబులువిని లక్ష్మణుఁడు "అగ్రజా! సాధ్వీతిలక యైన సీతామహాదేవిపై నపవాదమా! యనిన తమ్మునివాక్యములు రామచంద్రుఁడు విని, "తమ్ములారా! లోకప్రఖ్యాతిఁ గాంచిన యిక్ష్వాకువంశమందు మనము జననమొందితిమి. సీత శ్రేష్ఠుఁడైన జనకుని సద్వంశమందు జన్మించినది. దండకారణ్యమునందు దశకంఠుఁడు జనకజ నపహరించుటయు, నేనతనినిఁ జంపుటయు లోకమెఱింగినదేగదా! ఆనాఁడే 'పరునియింటనున్న సీతనెట్లు పురంబునకుఁ గొనిపోదునా'యని నేను సంశయింపఁగా సీత యగ్నిప్రవేశమొనరింప ననలుఁడు సీతపతివ్రతయని నుడువ లేదా! దేవతలు సీతనిర్మలశీలయని సాక్ష్యమీయలేదా!

సీతహస్తము నాహస్తమందుంచి దేవతానేత 'జానకి నిర్మలశీల' యని నుడువలేదా! అదియేకాదు నాయంతరాత్మకూడ సీత నిర్దోషియని ఘోషించె. అందువలన తోయజాక్షి నయోధ్యకుఁ దెచ్చితిని. నేఁడు రావణుఁడు చెఱఁగొనిపోయిన సీతను దెచ్చితి నను లోకాపవాదము దుస్సహమై నన్ను దహింపఁజేసినది. రాజ్యమున విపరీతపువార్తలు వినఁబడుచున్నవి. కావున నెవని యపకీర్తి లోకమున నెంతకాలమునిల్చునో యంతదనుక భువనములందుఁ బురుషుఁడు పాపభోజియైనిల్చును. అందువలన మానవుఁడు సత్కీర్తికొఱకుఁ బ్రయత్నముచేయవలయును. యశస్సునకై మిమ్మైన విడనాడుదును. నాప్రాణములైనను, విడుతును. లోకాపవాదమునకుఁ బ్రతిక్రియకన్యకను విడువఁదలంచితిని. ఇది చిత్రముగాదు. సోదరులారా! యెట్టిలోకాపవాదముపాలైతినో చూడుడు! ఇట్టిమహాదుఃఖము నేనెట్టిదశయందును గాంచి యెఱుఁగను. లక్ష్మణా! నాయాజ్ఞానుసారము వాల్మీక్యాశ్రమ విలోకనార్థ వ్యాజంబున విడిచిరమ్ము. నీవు మాఱుపలుకకుము. మదాజ్ఞానుబద్ధుడవై పొమ్ము. లేకున్న నాకోపాగ్ని పాలయ్యెదవు. నాయందునీకు గౌరవమున్న నాయాజ్ఞ శిరసావహింపుము. 'ఆమె నెట్లుగొనిపోదునా' యని యాలోచింపకుము. గంగాతీరమునకుఁజనితపస్వినుల సేవఁజేసివచ్చెదనని గోరుకొన్నది ఆనెపమునఁ దోడ్కొనిపోయి సీతనందువిడచిరమ్ము"ని యాజ్ఞాపించి, బాష్పపూరితాననుఁడగుచు వారితో మాఱుమాటాడక శ్రీరామచంద్రుఁడు తన మందిరమునకరిఁగెను.

# శ్రీ జానకీ శపథము.



## ద్వితీయ ప్రకరణము



సీతనునిందించిన జనులను దహించుటకో యనునట్లు దినకరుఁడు తీక్ష్ణముగాఁ వెలుఁగుచుండెను. ఆసమయంబున సౌమిత్రి దీనవదనుఁడై సుమంత్రునిఁబిలిచి, "సుమంత్రా! రథమును సిద్ధముచేయుము. రామచంద్రునియాజ్ఞమీాద జానకీదేవిని ఋష్యాశ్రమంబులకుఁ దోడ్కొనిపోవలయు" ననగా సారథి రథమును సిద్ధముచేయుచుండెను. అంతట లక్ష్మణుఁడు సీతాంతఃపురమునకు వెడలెను. సీతాదేవి తన యంతఃపురమునకు వచ్చిన సౌమిత్రినిఁజూచి, "లక్ష్మణా! ఏలవచ్చితి" వని ప్రశ్నించెను. అంతట లక్ష్మణుఁడు మనసునందున్న విచారమును వెలిబుచ్చక, "వదినా, నీహృదయేశ్వరునొక వరముఁ గోరితివఁట! ఆయన సమ్మతించెను. 'జాహ్నవీతీరమందున్న ఋష్యాశ్రమంబులకు నిన్నుఁ దోడ్కొనిపొమ్మ'ని నాకాజ్ఞ నిచ్చెను. తేరు సిద్ధమయ్యె"ననగా, సీత, "లక్ష్మణా! నిన్ననే

సుమీ మీయన్నగారిని నేనడుగగా నొంగా”క యనియెను. ఇంతలోనె నిన్నా కార్యమునకు నియోగించెనా? ఆహా! ఏమి నాయదృష్టము! లక్ష్మణా! నేను భూవిభుని పత్నినై రిక్తహస్తములతో నేమని మునిపత్నులను జూడబోదును? వారికి చేలంబులు స్వర్ణభూషణంబులను దీసికొనిపోయి ప్రేమతో నొసంగెదను. లక్ష్మణా! యివి వారికి బాగుండునా? ఇవి మనమీయవచ్చునా? ఇవి మంచివగునా? కాదా-”యని సంతోషముతో నాతని నడుగుచు, “లక్ష్మణా! మాట్లాడవే” మను వచనంబులు లక్ష్మణుఁడువిని పొంగి పొరలివచ్చు దుఃఖమును తనలో నాపుకొని, యగుననుచు సీతాదేవి యెంతసంతోష పడుచుండెనో యంతకు వేయిరెట్లు తాను మనస్సులో దుఃఖించుచు పైకేమాత్రము దుఃఖమును గనుపడనీయక ధైర్యముతో సీతను రథమెక్కించి రాముని యాజ్ఞఁ జెల్లించుటకుఁ దానుగూడ రథారూఢుఁడై సుమంత్రుని రథముఁదోలుమని యాజ్ఞాపించెను. రథమతిరయంబునఁ బోవుచుండెను. అంతట సీత “ లక్ష్మణా, దారియందపశకునము లగుచున్నవి. నా మనసేలకో దుఃఖపూరితమగుచున్నది. ప్రపంచమంతయు బాడుగా గన్పట్టుచున్నది. నా ధైర్యమంతయు సీటగలియుచున్నది. కుడికన్నదరుచున్నది. మీయన్న నన్ను ప్రేమతో నీ మ నో గ త మై న కోరికలఁ గోరుకొమ్మనగా వేఱేదైన గోరుకొనక నేనీఋషిపత్నులను జూడవలయునని యెందులకు గోరుకొంటినో తె లి య ద య్యె గ దా! హాతాహతంబు

లెఱుఁగరు సతుల'ని నానా ధుఁడు నువా రింపఁడ య్యె.
ఘోరారణ్యంబులందు సంచరించి నాథునివిడనాఁడి యుదినటకు
సర్వకష్టంబులను పడి, తిరిగి ఘోరారణ్యములకుఁ బోవనెంచిన
పాపాత్మురాలనగు నాకుదుశ్శకునంబులు గాకుండునా? వినాశ
కాలంబునకు విపరీతపు బుద్ధులుపుట్టునని పెద్దలుపలుకుదురు.
ఏమికీడుమూఁడునోగదా! లక్ష్మణా మాట్లాడవే''మన లక్ష్మణుఁ
డాయమ్మ చిత్తశుద్ధికి మెచ్చుకొని "అయ్యో! ఈలోకైక
మాతను బతినుండి దైవమిట్లు విడఁదీయదలంచెనుగదా!" యని
దీనవదనుఁడై తలవంచుకొని గూర్చున్న లక్ష్మణుని సీతగాం
చియు దైవతంత్రము మీఱఁజాలక యేఱులను, పర్వతంబులను
నదులనుదాఁటి భాగీరథిని సమీపించిరి. సుమిత్రాతనయుఁడు
భాగీరథినిఁగాంచి విచారమును పట్టఁజాలక 'హా'యని దీనముగ
నేడ్చుచుండెను. సీత సౌమిత్రినిగాంచి "లక్ష్మణా యేడ్చుచుం
టివేమి? మనకేదైన నాపదవచ్చెనా? ధైర్యవంతుఁడవుగదా,
యెన్నిదినంబుల నుండియో నీగంగను దర్శింపవలెనన్నకోరిక
నేఁటికి సిద్ధించెను. ఈగంగను దర్శించినతోడనె నాకోరికతీరెను.
పుణ్యగంగాతటినీతటంబుఁగనినంతనె నేడ్చుచుంటి వేమి?
సంతోషకాలమునందేడ్చుట తగునా? అడవియందాహార
నిద్రలు మాని యగ్రజునిఁ గొలుచునప్పుడైనను, యుద్ధమున
నింద్రజిత్తునితో ఘోరముగ పోరుసలుపు నపుడైనను, దుర్మా
ర్గుండైన రావణునిశక్తిబాణమునఁబడినప్పుడైనను కన్నీరు
విడువలేదే? ధైర్యముచెదరిపోలేదే? తండ్రీ! కారణముఁజెప్పుము

సమస్త దుఃఖములను పోగొట్టునట్టి గంగను వీక్షించి దుఃఖించుట న్యాయమా" యని సీతపలికిన, లక్ష్మణుఁడు దీనవదనుఁడై "తల్లీ! యిట్టిశోకదావాగ్నియందు నాహృదయము దహింపఁబడుటకంటె మరణము మేలు. జననింద్యకృత్యము బూనివచ్చిన నన్ను శపింపు" మని సీతపాదములపైఁబడి యేడ్చుచున్న లక్ష్మణుని జూచి, సీత "తండ్రీ! ఆపత్కాలమందైన నిట్లు ధైర్యముఁ బొందియెఱుఁగవు. ప్రజలు సుగుణరాశివని పలుకుదురు. అట్టి వాఁడవిపుడు నీ వెవరికెగ్గు తలపెట్టితివి? పరసతులను తల్లులతో సమానముగఁజూతువు. పరధనంబన్న విషతుల్యముగాఁ దలంతువు. ఎన్నడు నసత్యమును బలుకవు. పరుషవాక్యంబులు వచింపవు. బ్రాహ్మణులను దైవముతో సమానముగ బూజింతువు. ఇట్టినీవు జననిందఁబడయు పనులేమి జేసితివి? నీయన్న నిన్ను నిరాకరించెనా? లేక నీకా రామునిపై భక్తి తొలఁగెనా? కాకన్న గురుదూషణ సల్పితివా? పరులను దూషించితివా? శరణన్న వారిని ద్రోహిసి వంచితివా? అరులకు వెన్నిచ్చితివా? రామాజ్ఞ లేక నన్నీయడవులకుఁ గొనివచ్చితివా? తండ్రీ! నాకు భయమగుచున్నది. లక్ష్మణా! నీవట్టివాడవుగావు. నీసుగుణంబులు నేనెఱుఁగుదును. నీవు దుఃఖింపుచుండ నాకు దుఃఖము గలుగుచున్నది. నీదుఃఖముఁజూచిన వింతగానున్నది. నీదుఃఖమునకు గారణము నేనెఱుఁగుదును. రామునికొలువు నెడబాసి నిమిషమైన నిలువఁజాలవు. మనము బయలుదేరి త్రిరాత్రములు గడచెను. దానికై యింత విచారపడనేల? నాకాపురుషోత్త

మఁడు ప్రాణములకంటె మిన్నయైనను నీవలె దుఃఖింపు చుంటివా? గంగానదిఁదాటి వేగముగా ఋషిసత్తములకు స్వర్ణ భూషణంబులను, పట్టువస్త్రంబులనిచ్చి వారినిపూజించి యొక రాత్రి వారితో ముచ్చటించి పురికిమరలుదము. నామనోహరుని గాంచుటకు నామనంబు త్వరపడుచున్న"దని సీత పలుకువచ నంబులు లక్ష్మణుఁడు వినుచు కన్నులనీరు తుడిచికొనుచు సీతతో నావనెక్కి సుమంత్రుని యచట నిలువుమని యాజ్ఞాపించి జాహ్నవిఁదాటి సీతనుజూచి దేహమెల్ల కంపమెత్త కన్నుల నుండి నీరువరదలై కారుచుండ విచారపూరితాంతఃకరణంబున "తల్లీ! నన్నిట్టి కష్టపుఁబనిఁజేయుమని రామచంద్రుఁడేలనాజ్ఞా పించెను? ఇది బలవత్తరమైన శూలమై నన్ను బాధుచుచున్నది. ఇటువంటి పాపాత్మునకు సౌఖ్యకరమైన మృత్యువురాకున్నది. ఘోరమైన యిట్టిదారుణకార్యముఁ జేయుటకు భూపతికి నేనే దొరకితిని. తల్లీ! రామచంద్రునకు ఇదిన్యాయమేనా? నేను చేయుపని పాపపుపనియైనను నేను పాపాత్ముఁడనని యెంచకుము తల్లీ! నన్నుక్షమింపు"మని మోకాళ్ళపై బడి "మృత్యుదేవతా! రమ్ము. నన్నుఁగొనిపొమ్ము. ఈకఠినమైన రామాజ్ఞ సీతల్లితో జెప్పుటకు నాహృదయము బ్రద్దలగుచున్న"దని పరిపరివిధముల పరితపించు సౌమిత్రినిసీతజూచి మిక్కిలివెఱపుఁగొని, "లక్ష్మణా, ఇట్లువిచారించుటకుఁ గారణమేమి? రామచంద్రునికి క్షేమమే గదా? నామనసగ్నివలె మండుచున్నది. శరీరము వణకుచున్నది. నీపరితాపకారణముఁ జెప్పనియెడల భూపతిపై యాన. నీవనుమా

నింపక నాసమక్షమందు నీవిచారకారణముఁ దెల్పు” మను జానకి వాక్యంబులు లక్ష్మణుఁడువిని, చేయునదిలేక తలవాల్చి బాష్ప పూరిత లోచనుఁడై గద్గదస్వరముతో రామాజ్ఞనిట్లని జెప్ప దొడఁగెను. “తల్లీ! ఏమనివచింతును? రావణుఁడు చెఱఁగొని పోయెనన్న లోకాపవాదము నిన్నుగూర్చి పట్టణములందునుఁ బల్లెలందును, జనులలో ప్రబలెనని రామచంద్రుఁడు చారుల వలనవిని, దుఃఖముతో లోకాపవాదమును భరింపఁజాలక నిర్ద యుఁడై సాధుశీలవని యెఱిఁగియు, పుడమియందుగల జనులకు వెఱచి, వాల్మీకాశ్రమ భూములకు నీమనస్సునందలి కోరిక నెప మునఁ దోడ్కొనిపోయి విడచిరమ్మని నాకాజ్ఞాపించె” నను వాక్యములు సీతవినినంతనే మొదలునఱకిన తరువువలె “హా” యని మూర్ఛిల్లి, కొంతసేపటికిలేచి, “అయ్యో! లక్ష్మణా! పిడుగుకంటె ఘనతరమైన యీ కఠిన వాక్యమును విని నాగుండెలు బ్రద్దలగుచున్నవి. పాపాత్మురాలనగు నాకాపదలపై యాపదలే వచ్చుచున్నవి. లక్ష్మణా! రామచంద్రుని పలుకులు పరాకునవింటివా, లేక మతి భ్రమించెనా? అయ్యో! నీవజ్ఞానివా? నీకిటువంటిభ్రాంతి యెందులకుగల్గును. ఈజన్మలో నాకింక నాథునిఁ గాంచు భాగ్యము లేదుకాఁబోలు. రావణుఁడు చెఱగొనిపోయినపుడు రామచంద్రుఁడేనాఁటికైనను వచ్చి నన్నుగొనిపోవుననునాశతో బ్రతికియుంటిని. నేఁడు రామచంద్రుఁడే నన్నువిడచిన నాజీవము లున్ననేమి, పోయిననేమి? లక్ష్మణా! యెఱుఁగని మూఢాత్ముల

వచనంబులకు రామచంద్రుఁడు వెఱచి నాపై కఠినత్వము వహించి యీఘోరారణ్యముల పాలుజేసెనుగదా! నన్నుతన సన్నిధికిఁబిలిపించి యిట్టిలోకనింద నాపై వచ్చెననిపలుకఁడయ్యెను నాపై నున్న యభిమానము, నాపై ప్రేమ, ప్రియోక్తులు నేమయ్యెనోగదా! ఆ ప్రజలే నను మున్ను నేనగ్నిఁజొచ్చినపుడు దేవతలందఱు బాగడిరనువార వినలేదా? ఆదేవతానేత సీత నిర్దోషురాలని రామునితోఁజెప్పిన మాటలు సర్వలోకంబుల మ్రోఁగలేదా? అనసూయ మొదలగు మునిపత్నులు నన్ను సాధ్వీతిలకయని నుతించిరని వినియు నన్ను నిందించినంతమాత్ర మున రామచంద్రుఁడు నన్ను నమ్మకపోవుట నాయభాగ్యము గదా! లక్ష్మణా! నానాథుని ముఖపద్మము నొక్కసారి చూడ నై నను జూతునుగదా! కడసారి యీమహాత్ముని పాదపద్మము లకు మ్రొక్కి మీసేవచేయుభాగ్యము నేటితో నాకుఁదీరెనని నాపాపపుచేతులతో నానాథుని సేవించియుందును. లక్ష్మణా! నీవేమిచేయగలవు? నాయదృష్టమిట్లున్నది. . బ్రహ్మ నన్ను సర్వదుఃఖములననుభవించునట్లు విధించెను. ఎట్టి ఘోరపాపముఁ జేసితినో, కాకున్న నిర్నిమిత్తముగ నేపాపమునెఱుంగని నాపై నానాథుఁడు నిర్దయుఁడై నన్నీ నట్టడవిపాలుజేయునా? నేనీ ఘోరారణ్యములందెట్లు సంచరింతును? ఇది వఱకడవి యందున్నను రామచంద్రుని పాదారవిందసేవఁ జేయుటవలన గష్టములైనను సంతోషముతో భరించి యోర్పుతోనుంటిని. ఇప్పుడీ నిర్జనాటవియందొంటరిగా నెట్లుందును? నాదుఃఖముల

నెవరితో జెప్పుకొందును? పుణ్యశీలుండైన రామచంద్రుండు నిన్నీఘోరారణ్యముల కేలబంపించెనని యడిగెడు మునిపుంగవులతో నేమనిబలుకుదును? రామచంద్రుని పత్నినై భూమిపై బోకుందునేని, సౌమిత్రీ, యీ జాహ్నవిలోబడి మేను త్వరలో త్యజింపకుందునా? నేనీదుఃఖమును బట్టజాలక యీగంగలో బడిన, మహానుభావుండైన రామచంద్రుండు నన్నుజంపించెనను నపకీర్తి రఘువంశమునం జిరకాలము నిలుచును. లక్ష్మణా! రామచంద్రుని యాజ్ఞప్రకారమే చేయుము. దుఃఖభాగినియు, దురదృష్టవతియు, నగు నన్నీ ఘోరారణ్యమున విడచిపొమ్ము. చింతమానుము. భూవరుని యాజ్ఞలో నిలువుము. నామాటలుగా, రామచంద్రుని పాదపద్మములపై వ్రాలి మీ క్షేమముం గోరుచుంటినని విన్నవింపుము. అత్తగారికి ప్రాంజలినైతినని నుడువుము. రామచంద్రునితో జానకి నిర్మలశీలయనుమాట నీ వెఱింగిన దేయనుము. నీకీర్తి కొఱ కెల్లపుడు గోరుచుంటినని నుడువుము. నీవే నాకు పరమగతి కావున నీకీర్తిని నిలుపుట నాకు ధర్మమని విన్నవింపుము. రాజ్యమందెల్లవారిని దన పూర్వులరీతిని ధర్మమార్గముం దప్పక భూపాలనముజేసి యుత్తమగతిఁబొంది యెక్కుడైన కీర్తిఁబొందుమని విన్నవింపుము. నాశరీరము దుఃఖముతో కృశించినను విచారింపవలదని దుర్మార్గులైన పౌరులనిందావాక్యముల కెక్కువైన దుఃఖము బొందుచుంటినని విన్నవింపుము. శరీరములకు దూరమైన నాత్మలకు దూరముకాదని వచింపుము. పురజనుల శూన్యాప

పాదములకుఁ బొల్పడకుండునట్లు ధరణీభారముఁబూనుమనుము. భార్యకు ప్రాణనాథుఁడే దైవము, గురువు, చుట్టము, నగుట వలన ప్రాణములకంటెను సతీమణులకు భర్తయే యధికుఁడుఁ గావున, మీయాజ్ఞ శిరసావహించితినని విన్నవింపుము. గర్భ వతినైన నాకిట్టి ఘోరారణ్యము నివాసమాయెననుము. నాయనా! ఈవాక్యములన్నియు నావాక్యములుగా మీా యన్నతో నాయందు కరుణించి విన్నవింపుము. పురికిఁ బొమ్మ"ను సీతవాక్యములు లక్ష్మణుండువిని దీనచిత్తుఁడై యామె పాదముల క్రోల నేలదాకునట్లు తన శిరంబువంచి వసుధాతనయతో నొక్కపలుకైన వచింపలేక యధికమైన దుఃఖముతో నేడ్చుచు నెట్టకేలకు ధైర్యముతో సీతకిట్లనియె, "తల్లీ! నీవేమిపలుకుచుంటివో తెలియక దుఃఖసముద్రమున నా మనసంతయు గ్రుంగియున్నది. నీపాదపద్మములఁదప్ప నేఁటి వఱకు నీయొక్క స్వరూపము నాకన్నులారగాంచి యెఱుఁగను. తల్లీ! ప్రాణనాథుఁడీరీతిని విడనాడెనని తనువును గంగకర్పణము చేయవలదు. రఘువంశము నీవలన నుద్ధరింపఁబడనున్నది. ఆత్మహత్యఁజేసికొన్న నాదోషమేఁగాక, భ్రూణహత్యాదోషం బుఁగూడ బొందఁగలవు. జనసంచారములేని యీయరణ్య మందు రాముఁడునీయుండలేనితరి నేనుండుట తగ"దని వెడలుచు లక్ష్మణుండు దీనవదనుఁడై "సూర్యచంద్రులారా! తాపసోత్త ములారా! ఈఘోరారణ్యమున కఠినాత్ముఁడనై, యీతల్లిని విడచిపోవుచుంటిని. మీారేరక్షింపు"డనుచు లక్ష్మణుండు విచా

రముతో వేగముగా నదీతీరమునకుఁజని నావపై నెక్కి యావలి యొడ్డుఁజేరి రథముపై బడి విచారసముద్రమున మునిఁగిపోవు చుండెను. సీతయు రాజధానికిఁబోవుచున్న లక్ష్మణుని మాటి మాటికి జూచుచు, దిక్కులేనిదై భూమిపైఁబడి పొరలుచు భయంకరమైన ఘోరారణ్యమున స్తవనీయచరిత యగు నక్కమలాక్షి ఘోరముగా విలపించుచు, "రామచంద్రా! పార్వతీవల్లభుని వింటిని ఖండించితివి. కాననమున మాయామృగ మును జూచి దానిఁబట్టుడని ప్రార్థింప మారీచుని నానిమిత్త మేగదా గూల్చితివి. సుగ్రీవునితో స్నేహముసలిపి వాలిని నానిమిత్తమేగదా ఖండించితివి. అతిభయంకరయుద్ధమున దశ కంఠుని నానిమిత్తమేగదా వధించితివి? ఇట్టిపనులన్నియు నానిమి త్తమేగావించి తుట్టతుదకు జననిందకు నన్నిట్లు మహారణ్యముల పాలుజేయుట ధర్మమా? అనుకూల దాంపత్యమని మనస్సులో పొంగుచుంటినిగాని నట్టడవుల పాలౌదునని తెలిసికొనలేక పోతిని. నీపైన నేనగ్నిఁజొచ్చుట యెఱుఁగవా? అయ్యో! ఎన్నితలంచుకొని దుఃఖింతును? నాయొక్క పురాకృతపాప మిట్లుండెను, గాకున్న కరుణాసముద్రుండును, శరణాగత రక్ష కుండును నగు నాప్రాణేశ్వరునకు నాపై దయదప్పునా? శరణన్న మాత్రమున శత్రునితమ్ముఁడనియైననుఁ దలంపక విభీషణునకు శరణమిచ్చె. నాకెగ్గుసల్పినటువంటి కాకాసురుని రక్షించెనని పరిపరివిధముల దుఃఖించుచు నాయరణ్యమున మార్గముఁగానక తిరుగుచుండెను.

# శ్రీ జానకీ శపథము.



## తృతీయ ప్రకరణము



మునిబాలకులేడ్చుచున్న జానకినిఁజూచి, పరువున వాల్మీకాశ్రమమునకుఁజని నమస్కరించి "మహాత్మా! ఏమహానుభావుని యిల్లాలో లక్ష్మీదేవియని చెప్పవచ్చును. ఇంతకుమున్నెన్నఁడును మేమీవనమున నామెనుజూచియుండలేదు. దేవలోకమునుండి దిగివచ్చిన దేవకాంతయో, లేక సరస్వతీదేవియో మాకుఁదెలియదు. గంగానదీతీరమున దుఃఖముతో దిక్కులేకయొంటరిగా నిటునటుఁదిరుగుచున్నది. మనుజకాంతగా నగపడుటలేదు. ఆమెను రక్షింపు"డని మునికుమారులు విన్నవింప, వాల్మీకి జ్ఞానదృష్టిచే కరతలామలకంబుగా సర్వముఁ దెలిసికొని వేగముగా శిష్యులతో నర్ఘ్యంబుఁగొని గంగాతీరమునుజేరి సీతను వీక్షించి, దయాంతఃకరణంబుల నిట్లనియె, "అమ్మా! విచారపడకుము. దశరథమహారాజు కోడలవు. శ్రీరామచంద్రుని బత్నివి. జనకమహారాజు తనయవు. పతివ్రతల మేల్బంతివి. అమ్మా! నీకు స్వాగతము. యోగదృష్టిచే సమస్తము నెఱిఁగి

తిని. నీయందు దోషమెంతమాత్రములేదు. తల్లీ! భయము విడువుము. నన్ను నీజనకునితో సమానునిగా జూచి, యార్తి విడనాఁడి యర్ఘ్యంబుఁగైకొని నామందిరమునకు విచ్చేసి, నా గృహము నీగృహముగా భావించుకొనుము. నిన్నుఁగాపాడుటకు నాయాశ్రమమున తపస్వినులున్నారు. నిన్ను బుత్రికతో సమానముగా జూతురు. తల్లీ! ఈముల్లోకంబులు సాక్షిగా నిన్ను రక్షింతును, రమ్మ"ని వాల్మీకిపలుక, నామునీశ్వరుని బల్కులువిని సీత నమస్కరించి, యాతనివెంట నరిగెను. జానకితో వచ్చుచున్న మునీశ్వరునిఁజూచి "ఏమిసెలవ"ని మునిపత్నులు నమస్కరించి యడుగగా, "తపస్వినులారా! ఈమె సీతాదేవి. రాముని బ్రియపత్ని. దశరథునికోడలు, జనక మహారాజు తనయ, సాధుచరిత, పరమపతివ్రత. పాపహీన యయ్యు భర్తచే సత్యపరిపాలన కొఱకు విడువఁబడెను. కావున నీతల్లిని మీరుభక్తితోఁ గాపాడవలయు"నని నొక్కి చెప్పి సీతను వారికప్పగించి తన కుటీరమునకుఁ జనియెను. చీనిచీనాంబరములు ధరించు శృంగారవతి నారచీరలఁదాల్చెను. పంచభక్ష్య పరమాన్నములారగించు కమలాక్షి కందమూల ముల భక్షింపుచుండెను. మణిమయములగు నంతఃపురముల విహరించు జవ్వని పర్ణశాలలందు సంచరింపుచుండెను. శుద్ధాంత కాంతలుచేయు బరిచర్యలకు మెచ్చనికాంచనాంగి ముని కాంతలుచేయు బరిచర్యల కలరుచుండెను.

అంట లక్ష్మణుండయోధ్యకై పునకు రథంబు మరల్పు మని సుమంత్రునకానతిచ్చుటయు, నారథసారథి పవనవేగంబున రథంబును దోలుచుండ లక్ష్మణుండు కెవ్వునకేకవైచి రథంబు నిల్పుమని సుమంత్రునితోఁజెప్పికిందకుదుమికి సుమంత్రునితో "అన్నా! కన్నతల్లిని సీతనడవిపాలుజేసిన మహాపాపాత్ముండను నేనయోధ్యకు రాంజాలను. ఎంత ఘోరకృత్యమున కొడిఁ గట్టితిని? నిండుచూలాలిని ఘోరవ్యాఘ్రములమధ్య దిగ విడిచి నేనెట్లు పోవుదు"నని బోరున విలపించుచున్న లక్ష్మణుని సుమంత్రుండు తేరుమీఁదకుఁ దీసికొనివచ్చి, "సౌమిత్రీ! ఎంత చేలవగుచున్నావు? పురాకృతకర్మఫలముఁ దప్పింపనెవరితరము? ఈమె కొన్నాళ్ళడవిపాలు గావలసియుండునని పూర్వమే నిర్ణ యింపఁబడియున్నది. దైవతంత్రము దాఁట శక్యముగాదు. దూర్వాసుండను మహర్షి వసిష్ఠునాశ్రమంబుననుండ, మీ జనకుండా మహర్షిఁ జూడఁగోరి యచటికేఁ జనెను. దినకరుని బోలె వెలుంగుచున్న యతీంద్రునిగాంచి భక్తితోఁబాదంబులకు నమస్కరించి, పూజించిన, నామహానుభావుఁడు రాజునుసత్క రించి యనేకవిధములైన గాథలును, మధురోక్తులను, వినిపించిన భూపతి సంతోషమున నిట్లనియె, 'మహాత్మా! నావంశపరి మాణమెంత? రామునియాయువెంత? తక్కిన కుమారులెంత కాలము ధరణిపై నుందురు? శ్రీరామునకు కుమారులెందఱో నావంశవిధముఁ జెప్పుడని ప్రార్థింప దూర్వాసుండుర్వీవిభున కిట్లనియె, 'రాజేంద్రా! పూర్వకాలమున, నసురులు గర్వింప వారినందఱను సుపర్వులుఁ దఱుమగా వారు మిక్కిలి

భయపడినవారై, భృగుపత్నిని శరణుబొందిన, నామెగుణయు వారికభయంబిచ్చిన, వారామెచెంత నిర్భయముగా సుఖింపు చుండ, విష్ణువు భృగుపత్నిని తనచక్రముచేతఁ ద్రుంచగా, సతీ మరణంబునకు భృగుమహర్షి కోపించిఁ నాపత్నినిఁ ద్రుంచితివి గనుక, శ్రీవత్సా! నీవు ధరణిపై జన్మించి దారావియోగ వ్యథచేతఁ దపింతు'వని శాపంబిచ్చిన, భక్తవత్సలుండును పరమ దయామూర్తియునగు శ్రీహరి లోకరక్షనార్థముః భృగుమహర్షి శాపమును గ్రహించి సీతనయుఁడై జన్మించెను. రాజా! శ్రీరాముఁడు చాలకాలము రాజ్యమేలి సర్వసౌఖ్యములు ననుభవించును. పదివేలవత్సరములు జనరంజకంబుగాఁ బరి పాలించును. అశ్వమేధంబులెన్నియో జేయును. రాజవంశ ములుఁ బెక్కులు స్థాపించి ధర్మముతోఁ బాలించును. 'రామ చంద్రునకు సీతయందిర్వురుబిడ్డలు బుట్టెదరు, వారు భూపతులై యయోధ్యను గీర్తితోఁ బాలింతు'రని మునిచెప్పగా దశర థుఁడు విని పురంబునకరుదెంచె. లక్ష్మణా! శాపకారణమే సీతను రామచంద్రుఁడు విడనాడుటకుఁ గారణమాయె'నని లక్ష్మణునకుఁ దెల్పుచు మనశ్శాంతిఁ గలుగఁజేసెను. అంతట వారలారాత్రి యచటగడపి సూర్యోదయము కాఁగానే పురము నకుఁ బోవుచు లక్ష్మణుఁడు తన స్వాంతమున, "అయ్యో! రామునకు నేనేమనివచింతును? ఆయనమొగమెట్లు జూతును? 'సీతను మహారణ్యముల పాలుజేసితివా? ఆరామునకుఁదగిన దమ్ముఁడ'వని బల్కు తల్లులకేమని జెప్పుదు"నని విలపించుచు పురంబునకుఁ బోవుచుండెను.

# శ్రీ జానకీ శపథము.



## చతుర్థ ప్రకరణము



శ్రీరామచంద్రుఁడు తన మందిరంబున నొంటరిగాఁ గూర్చుండి, "హా! ఘోర విపినముల నీవేమైతివోగదా! నీవు పూతచరితవని నేనెఱింగియు నిన్నడవిపాలుజేసిన కఠినాత్ముఁడను గదా! నేను విల్లు విఱుచునప్పుడు నావైపు నీవు ప్రసరించిన లజ్జాయుతంబగు వీక్షణంబు నేనెట్లు మఱతును? నీచెలికత్తెలు నన్ను నీకుఁ జూపి 'నీప్రాణేశ్వరు'డని జెప్పినపుడెంత సంతోషపడితివి. నీవు సిగ్గుతో దలవంచిచూచిన జూపులన్నియు నేఁ డడవి పాలయ్యెనుగదా! ప్రాణేశ్వరీ! నిన్నాయరణ్యంబునకుఁ బంపితిని గాని నీవియోగమును భరింపలేకున్నాను. ఎంతకాలమీ శోకముతో మేనప్రాణములు నిల్పఁగలను? నీవాయరణ్యములో నెట్లు జీవింతువు? నాయాజ్ఞవిని యెంత విలపించితివోగదా! నీవు ప్రాణములతో నుంటివో లేదో! నిన్ను జూచు భాగ్య మేనాటికైన నాకబ్బునా? నాతల్లులు వచ్చి కోడలేదని యడిగిన వారికేమి సమాధానము జెప్పగలను? ఊర్మిళా మాళవీ శ్రుతకీర్తులు

మాయక్క యెందున్నదనియడుగఁ బుత్తెంచిన చెలికత్తెల కేమి సమాధానము జెప్పుదును? శాంతవచ్చి జానకియేదనిన నేనేమని వాకుత్తును? జనకచక్రవర్తి విచ్చేసి మాముద్దులజానకి యెం దున్నదనిన నేమని సమాధానముఁజెప్పుదును. సీతా! నేనురఘు వంశమున బుట్టితిననియు, శివధనుర్భంగమొనర్చితిననియు సం తోషపడి నిన్నునాకిచ్చి వివాహముజేసిన నీజనకుఁడు, నిన్నడవి పాలుజేయుదునని స్వప్నంబునన్నైన నూహించియుండఁడు. వన వాసాయాసంబునంతనోర్చి, తుదకురాజ్యమున సౌఖ్యములఁ బొందవచ్చుననుకొంటిని గాని చివరకు నీవియోగము సంభవిం చునని దెలిసికొనలేకపోతిని. హా! ప్రాణేశ్వరీ! నాఁడడవియందు నీవునాచెంతనుండుటచే నయ్యది యయోధ్యయేయయ్యె. నేఁడు నీవు లేని యయోధ్యయు నరణ్యముగా మారినది. నాఁడు హనుమంతునకెన్నియో యానవాళ్లు దెల్పి నిన్ను రక్షింప నన్ను వైళమ రమ్మని వర్తమానమంపితివి. నేఁడు నేనే నన్నడవిపాలు జేసితిని. నీకింక నెట్టి యాశాంకురము గలదని యూరడిల్లుదువు? రాజధర్మ పరిపాలనార్థము నిన్ను త్యజించితిని గాని నీవెంత కుందుచుంటివోగదా! గర్భవతివైతివనియు, సుతోదయ భాగ్యంబు గలుగుననియు సంతోషపడితిని. హా! ప్రాణేశ్వరీ! చివరకు నిన్నెట్టి గడగండ్లపాలు జేసితిని. అంతఃపురాంతర్భాగం బులనుండు నీకు నట్టడవులా, నివసింపఁదగినవి? పుష్పశయ్యలఁ బవళించు నీకు కఠినశిలాభాగంబులా యర్హంబులైనవి? ఉద్యా నవనంబుల విహరించు నీకు ఘోరారణ్యభూములా సంచరణా

ర్థ్వాంములు. పంచభక్ష్య పరమాన్నంబు లారగించు నీకు కంద మూలములా భక్షణార్హ్వాపదార్థములని రాముఁడు పరిపరి విధ ములఁ జింతించుచుండెను.

ఆసమయంబున లక్ష్మణుఁడు రాజమందిరద్వారంబున రథంబుడిగ్గి, యెవ్వనిఁ దలయెత్తి చూడక, వాడినమోముతో, కన్నీరొలుకుచున్న నేత్రములతో, విలపించుచున్న చిత్తముతో, తడఁబడు నడుగులతో, లోపలికిఁబోవుచుండ పురజనులు విలో కించి 'మనమనుకొనినది నిజమని తోఁచుచున్నది. చూఁడుఁడు, చూడు'డని గుసగుసలాడువారును, 'సాధుశీలయైనజానకి కాపు రము మనయూరి పుణ్యాత్ములవలననె నిల్లయ్యె' ననువారును 'మాటమాత్రమున రామచంద్రుఁడింతటి సాహసమాచరింపఁ జనునా' యనువారును, 'మహాపతివ్రతను నిందించినవారికి జయముగలుగునా' యనువారును నిండుగర్భిణియగు సీతను రథముపై నీతఁడు గొనిపోవునప్పుడు చూచితి మిప్పుడామె యెంతఁగుందుచున్నదో' యనువారునై యుండిరి. వీనిని వినుచు లక్ష్మణుండు సింహద్వారముదాఁటి పోవుచు, చిలుకలేని పంజ రమువలె, పద్మములులేని సరోవరమువలె, చంద్రుఁడులేని యాకసమువలె, రామభక్తిలేని చిత్తమువలె, కీర్తిలేని బ్రతుకు వలెఁ గళాహీనమగు సద్మమువలె సీతలేక కళావిహీనమగు రామ మందిరమునకుఁజని యచట బుష్పశయ్యనువిడనాఁడి ఖిన్నుఁడై యొకరత్నకంబళిమీఁదఁగూర్చున్న రామునిఁజూచి లక్ష్మణుండు

విలపింపసాగెను. శ్రీరాముఁడును లక్ష్మణుని గాంచినతోడనే సముద్రతరంగములవలె పొంగి పొరలివచ్చుచున్న దుఃఖమును బట్టఁజాలక లక్ష్మణుని గౌగిలించుకొని "తమ్ముఁడా! సీత నాకేమని చెప్పె" నని బోరున విలపింపసాగెను. అంతటఁ లక్ష్మణుఁడు "అగ్రజా! జానకీదేవిని ఘోరారణ్యంబుల పాలుజేసిన పాపాత్ముఁడిదే నమస్కరించుచున్నా" డని నమస్కరించి "నీవంటి సర్వజ్ఞులైన పురుషులు దుఃఖింపఁదగదు. జననమరణములు కష్టసుఖంబులు తమ కర్మననుసరించి గలుగుచుండును. కావునను పుత్రమిత్ర కళత్రాదులయందును ధనకనక వస్తువాహనములందును ప్రాజ్ఞుండు విరక్తిఁగలిగిన చిత్తంబుతో నుండును. లోకాపవాదముఁబోవ జానకినివిడిచిన నీవు దుఃఖించినచో, ప్రజలు జానకీపక్షపాతివని మఱలనిందించిన శాశ్వతాపకీర్తి గలుగును. కావున విచారముఁబాఁడి ధీరుఁడవై రాజ్యపాలనము జేయుమ"ని సాంత్వవచనంబుల నూరడించెను.



# శ్రీ జానకీ శపథము.



## పంచమ ప్రకరణము



వాల్మీకాశ్రమమునందు సీతాదేవి కాలము గడపుచు శ్రీరామచంద్రుని సతతము మనసున ధ్యానింపుచుఁ గాలమును గడపుచుండగా నొకరాత్రి యామెకు ప్రసవచిహ్నములు గాన్పింప నందలి తపస్వినులాసీతకు పుత్రికఁబోలె సకలోప చారంబులుసలిపిరి. అంతట జానకి కవలబిడ్డలంగనియె. తపస్వి నులంత వాల్మీకిచెంతకరిగి 'మహాత్మా! సీతకిరువురు కవలబిడ్డలు పుట్టిరి. కానఁ దామువిచ్చేసి తద్రక్షణోపాయ మంత్రాదులఁ బ్రకటింపఁదగు'నని చెప్ప, నానందంబున నాతండువెడలి. జనక జాత్మజ పుత్రులనుజూచి భూతనాశకమంత్రబు లుచ్చరించి మంత్రపవిత్ర దర్భాంకురంబులా వృద్ధతపస్వినులకొసంగెను. తద నంతరంబు సీతాదేవికిఁ దపస్వినులు దశదివసంబులు జాగ్రత్త గాఁగాపాడి స్నానముగావించిరి వాల్మీకి వారలకు 'కుశ, లవు ల'ను సార్థకనామములుంచెను.

కుశలవులు దేదీప్యమానంబుగా వెల్గుచు దినదిన ప్రివర్ధమానులగుచుండిరి. వారిని వాల్మీకి సమస్తవిధంబుల రక్షింపుచు నైదవయేట నక్షరాభ్యాసముఁ జేయించి వేదోచిత సంస్కారంబులు యథావిధిగ నడపి వృద్ధిలోనికిఁ దెచ్చుచుండెను. సమస్త విద్యల నాబాలకులు చెప్పుట తడవుగా గ్రహించుచుండిరి. క్షత్రియ కుమారోచిత విద్యతోఁబాటుః రామాయణ మంతయు వాల్మీకి వారికిఁ జెప్పెను.

ఇట్లుండ సీతామహాదేవి తనలో "అయ్యో! నేనీ యాశ్రమంబున నెన్ని నాళ్లుందును? ఏనాఁటికైనను జనులాడు నపయశంబుపోయి ప్రాణేశుసన్నిధి సౌఖ్యంబులఁ బొందుదునా? ఇహంబున నాచేతులతో రాముని సేవఁజేయుభాగ్యమబ్బునా? ఎన్నటికైనను సాకేతనగరమునకుఁ బోవు భాగ్యము గలుగునా? నాథా! న న్నెఱింగియు నన్నడవుల పాలుజేయుట న్యాయమా? ఎన్నాళ్ళీ వనవాసక్లేశం బనుభవింతును. రాజ భోగార్హులగు నీపసి కూనలు నాపాపపు గర్భంబునం బుట్టి యడవుల పాలైరి గదా! పూర్వమువలె గాక వీరు విజ్ఞానముఁగలిగి 'అమ్మా మాతండ్రి యెందుండె'నని యడిగిన నేమని సమాధానంబు చెప్పఁగలను? నాకష్టచరిత్రంబు వీరలెఱింగిన నెంత తల్లడిల్లుదురో" యని యనేక విధముల విలపించుచు 'ఓసూర్య భగవానుడా! నన్ను నాప్రాణేశ్వరునితోఁ జేర్చిన ననేక సహస్ర గోదుగ్ధంబుల నీకర్పింతు నని యనేక విధంబుల దేవతలఁ

ప్రార్థింపుచుఁ జిత్తమందు శ్రీరాముని ధ్యానించుచు జడలు కట్టిన కబరీ భరంబుతో మాసిన చేలంబుతో విచార సముద్రమున మునిఁగి కాలమతి భారంబుగఁ గడపుచుండెను.

ఒక్కొక్క వేళఁ కుశుఁడు 'అమ్మా! విచారించుచుంటి వేల! మేమేమైన నేరముసల్పితిమా! తాతనిన్ను నిందించెనా! దిగ్గజంబులఁబోలు సుమారులము మేమునీయొద్దనుండ దుఃఖింపఁ గతంబేమి? ఎట్టికార్యంబునైనఁ జేయసంసిద్ధులము''ని విన్నవింపు చుండ లవుఁడు, 'అమ్మా! ఆఁకలియగుచున్నది. పండ్లిమ్మ'ని యడుగ సీత తనలో సర్వలోకపాలకుండగు శ్రీరామచంద్రుని బిడ్డలై యాహారంబు కఱవయ్యెనాయని లోన దుఃఖింపుచుఁ బొంగి పొరలివచ్చు దుఃఖము దిగమ్రింగుచు 'నాయనా, ముని కాంతలు ఫలంబులఁదెచ్చి యిత్తు'రని వారినూరడింపుచుండెను. అంతఁ గుశుండు ఫలములనుదే నడవికిఁబోయెను.



# శ్రీ జానకీ శపథము.

## షష్ఠము ప్రకరణము



శ్రీరామచంద్రుఁడొక దినంబునఁ దమ్ములతోఁ గొలువుఁ దీర్చియుండి, 'తమ్ములారా! రాజసూయంబు మీ సహాయంబునఁ జేయవలయునని సంకల్పించుకొంటిని. పూర్వమెందఱో రాజులు రాజసూయముఁ జేసి తరించి''రన భరతుఁడు కృతాంజలియై "అగ్రజా! జనరంజకముగా ధర్మపథమున రాజ్యమేలుచున్నావు రాజులును బ్రజలును నిన్ను దైవమువలెను, గన్నతండ్రివలెను భావించుచున్నారు. వారిప్రాణంబులు నీవని దలంచుచున్నారు. ఇట్టి మహానుభావుఁడవగు నీవు నృపవంశనాశనకరమగు రాజసూయంబు దలపెట్టఁ దగదు. భూవలయంబెల్ల నీకైవసమై యుండ నద్దానిం దలపెట్టఁబనియే''మనిన శ్రీరాముఁడువిని 'భరతా! నీవు చెప్పినది సత్యము. జనులకుఁ గీడు గలిగించునది భూపతులకుఁ దగదు. బాలుర వాక్యమైనను శుభవాక్యమైన యెడల నవశ్యమను వర్తనీయ'' మనెను. అంత లక్ష్మణుఁడు లేచి

అగ్రజా! అశ్వమేధంబుఁ జేసి సురాధీశుండు వృత్రాసురునిఁ జంపినందునఁ గలిగిన బ్రహ్మహత్యాదోషముఁ దొలఁగించు కొనెనని పెద్దలు వచింతురు. దశకంఠునిఁ జంపితివి గావున నీవును దానిని జేయఁదగు నని రాముఁడును మిగిలిన వారును సమ్మతించిరి.

వశిష్ఠ మహర్షికి వర్తమానమంపిరి. సేవకులు వారి ననతి కాలంబున శ్రీరాముని సన్నిధానమునకుఁ దోడ్కొని వచ్చిరి. అంతట శ్రీరాముఁడు వశిష్ఠు నుచితాసనంబునఁ గూర్చుండఁ బెట్టి నమస్కరించి తదాశీర్వాదముఁ బడసి 'మహాత్మా! మీయాజ్ఞయైన వాజిపేయము సలుప నెంచితి'' నని విన్నవింప నాతండు ''రామా! అశ్వమేధము సర్వశుభప్రదంబు నీవు దానినొనర్పుము. శుభములను బొందఁగలము. యజ్ఞప్రారంభ పూర్వము పవనాశ్వంబును విడువవలయును. అది యెవ్వరిచే నైన పట్టువడు నేనిఁ గ్రతుభంగమగును. కాన బలవంతులగు నశ్వరక్షకులఁ బంపవలయు'నన రాముఁడు ''మహాత్మా! యజ్ఞాశ్వరక్షణార్థము సార్థకనాముండగు శత్రుఘ్నునిఁ బంపెదనని చెప్పి సామిత్రినిఁ జూచి, ''ఈయజ్ఞమును వీక్షించుటకు బంధువర్గంబులతోఁ గిష్కింధా లంకాధిపులను నితర రాజన్యులను నుత్తమ బ్రాహ్మణులను నాహ్వానింపుము. దేశదేశంబులఁ గల మేటి వర్తకుల యంగళ్ళం బెట్టింపుము. యజ్ఞశాలలను గోమతీ తీరంబున నిర్మింపఁ జేయుము. సర్వకార్యంబుల బాధ్యత వహింపుమని యాజ్ఞాపించి మందిరమునకుఁ జనెను. భరతుండు యజ్ఞార్థ

ము సర్వసంభారంబులను గోట్లకొలఁది ధనమువెచ్చించి తెప్పించెను. నూతనభవనముల నతిథులకై గట్టించెను. యజ్ఞార్థము గోమతీతీరంబున విశాలమైన పందిళ్ళను, శాలలను లక్ష్మణుఁడు వేయించెను. సర్వసంభారములు నేకొఅంతలేకసమకూర్పఁబడెను యజ్ఞహయంబు లలాటంబున రామపరాక్రమ సూచకంబగు శ్లోకంబు నొండులిఖించి విడిచిరి. శత్రుఘ్నుఁడనేక వేలసైన్యముతో తద్రక్షణార్థము వెడలెను.

అట్లు పోవుచున్న హయంబునకు నమస్కరించువారును దాని దరికైనఁ బోవ వెఱచు వారును గాన్పించుచుండిరి గాని దాని నెవరును బట్ట సాహసింపరైరి. దేశ దేశములు తిరిగి తురంగము వాల్మీకాశ్రమ భూములఁ జొచ్చెను.



# శ్రీ జానకీ శపథము.

## సప్తమ ప్రకరణము



లవకుమారుఁడును మునికుమారులును వాల్మీకాశ్రమ భూములందాడుకొనుచు నావనప్రభావమును వర్ణించుచుండిరి. ఆహా! ఏమి! ఎంతయాశ్చర్యకరముగానున్నది! పగయనునదెంత మాత్రములేక కురంగములకుఁ బాలిచ్చు వ్యాఘ్రంబులును, భయమనునదెఱుంగక సింహములతోఁగలిసిసంచరించు గజంబులును, బిల్లులతోఁగలసిసంచరించు మూషికములుఁగలిగియున్న వనంబున మునిబాలకు లిట్లు చెప్పుకొనఁదొడఁగిరి "ముని కుమారా! యీవనంబునఁ గ్రూరజంతువులుసైతమిట్లన్యోన్యా నురాగము గలిగియుండుట మనతాతయగు వాల్మీకిమహాముని ప్రభావ"మని లవుఁడు చెప్పుచుండ శబ్దమొండు విన వచ్చెను. ఆశబ్దమెటనుండి వచ్చెనాయని లవకుమారుఁడు నలు దెసలఁ బరికింపుచుండ సర్వలక్షణ సంపన్నంబగు నశ్వమొండు గానఁబడెను. లవుఁడుదానినిఁజూచి "మునికుమారా! ఈయశ్వ

పాదఘట్టనంబున భూమియు నదరుచున్నది. దానినొసట నెయ్యదియో పత్రంబు గట్టఁబడియున్నది. దానిని జదివిరమ్మ” నఁగా నాతఁడు “లవకుమారా! ఈగుఱ్ఱముయొక్క-గమనమునకు నశ్వశిక్షాప్రవీణులైనను భయపడుదురు. ఆహయంబుజోలి మన కేటికి? దానిలలాటమున నేమిగట్టఁ బడియున్న మనకేమి? మన మువోనేల”యని యనుచున్నను సరకుఁగొనక దానిని దనయుత్తరీయముతో బంధించి దానిలలాటమునఁగట్టబడినపత్రము నీరీతిగాఁ జదివెను ‘భూవలయంబునఁగల యుత్తమక్షత్రియ వీరపుంగవులార! ఇయ్యది జగదేకవీరుండగు శ్రీరాముని యశ్వమేధ హయంబు. శూరులున్నయెడల రావణునిఁజంపిన రామునిగెల్చి హయంబును బట్టుఁడు, ఇట్లుచదివి లవుఁడుహయమునుగట్టినవె వ మునికుమారుఁడు “లవా! ఏలనీకింతసాహసము. ఈహయ మేమహారాజుచేతనో విడువఁబడిన క్రతువాజి. దీనినివిడువు” మనఁగా“మునికుమారా!శూరులెవ్వరైననుండినఁ బట్టుఁడని వ్రాసి యుండిరి. నేను శూరుఁడనుగనుక బట్టితి”నన లవకుమారా! మునికుమారులమగు మనకు స్నానసంధ్యాద్యనుష్ఠానంబులు,జప తపంబులుఁదగునుగాని హయమును బట్టఁదగదు. దీనివెనువెంట ధనుర్ధరులగు రాకుమారులెందఱో వచ్చియుందురు. కలహము సంభవించును. అర్ధానికి మనమర్త్యులముగాము. ఈసాహసంబును మానుమన” “మునికుమారా! భీతిల్లకుము. ఎందఱురాజశిఖా మణులేతెంచినను మనకు భయములే”దనఁగా, “లవకుమారా! నీవుపసిబాలుఁడవు. నిన్నుసేనలువచ్చి ముట్టడించిన నీవేమిచేయఁ

గల" వనెను. అప్పుడు లవుఁడు 'సోదరా! ఈహయమును విడిచి నయూతఁడు జగదేకవీరుఁడట. మఱెవరును వీరులు లేరా? నేనీ హయమునుబంధించి రాముఁడేమాత్రము వీరుఁడో చూచెదను. త్రిశూలధారియైన శివుఁడే తెంచినను భీతిలేక సురవర్గము నాసా హాసమున కచ్చెరువందునట్లు రణంబుసల్పెద"నన మునిబాల కుఁడు 'లవకుమారా! రామునిసోదరుఁడగు శత్రుఘ్నుఁడఁట! అల్లదే సేనలతో వచ్చుచున్నాఁడు. నాకు భయముగానున్నది. మీయమ్మ, లవకుమారుఁడు చిన్నతనమున సాహసకార్యముఁ జేసి నీవేల మాన్పింపవైతివని నన్నడుగును. కాన నాశ్రమం బునకుఁరమ్మ'ని పల్కునంతలో శత్రుఘ్నుఁడు ప్రవేశించి తనలో 'ఈబాలకుఁడెవ్వఁడో మాయశ్వమును బంధించి నిలిచియు న్నాఁడు. బాలునిముఖంబు పూర్ణచంద్రుని మించియున్నది. వీని కనుదోయికీపద్మములైనసాటిరావు. సౌందర్యరాశియైనసీబాలకుఁ డెవ్వరిపుత్రుఁడోగదా! వీనినిఁజూచినదిమొదలెడతెగని యను రాగము గలుగుచున్నది. ఈతఁడెవ్వఁడో కనుఁగొనెదనని యశ్వ సాన్నిధ్యముననున్న బాలకునిసమీపించి వీఁపునఁ జేయివైచి "కుమారా! నీవెవ్వరివాఁడవు. నీవీ వనభూములందు సంచ రించుచు భయములేక యజ్ఞాశ్వమునుబట్ట నేలసాహసించితివి? నన్నవసఁగాఁ దలఁచితివి? హయమును విడువుము. సాకేతపురా ధినాథుండగు శ్రీరామచంద్రుని యజ్ఞహయంబునుబాలుండ వగుటఁ దెలియకగట్టితివి. బ్రాహ్మణబాలుండవగు నీవు దీనిని ధైర్యముతోఁ గట్టినందులకు నవ్వువచ్చుచున్న'దనెను. అంత

లవుఁడు 'రాజా! వట్టిమాటలతో నేమిప్రయోజనము. బ్రాహ్మణుఁడనని నన్నుఁబరిహాసించుచున్నావు. బ్రాహ్మణులు సామాన్యులా? ఇరువదియొక్కమారు రాజవర్యులశిరంబుల నుద్దండుఁడై ఖండించిన పరశురాముఁడు బ్రాహ్మణుఁడు గాఁడా? అప్పుడీరాజుల పౌరుషమెక్కడకుఁబోయెను? నీమాటలకుభయపడువాఁడనుగాను. బ్రాహ్మణునకు భయపడి మూలడాఁగిన దశరథమహారాజు పుత్రుఁడవుగాదా? పొమ్ము! నీకుభయపడి హయమును విడుచువాఁడనుగాను. సంగరంబునుగోరియే యజ్ఞహయంబును బంధించితిని. నాయస్త్రంబుల వైరివీరులఁజెండి జయంబుగాంతు'నని పలికెను. అంత శత్రుఘ్నుఁడుఁ "బాలకా! నీవచనములకును, నీసాహసంబునకును సంతోషపడుచున్నాను. అయినను జిన్నవాఁడవగు నీవు క్షత్రియధర్మంబుల నెఱుంగవు. నీవాడుకొన బంగారుగుఱ్ఱంబుల నిప్పింతును. వెండియేనుంగుల నిప్పింతును. అవి నీయాటలకు జిత్రములైనవి. ఈయజ్ఞహయమును విడువు" మనెను. అంత లవుఁడు తిరస్కారపూర్వకంబగు పరిహాసం బొనరించి "రా జేం ద్రా! స్వర్ణహయంబు లేల. సజీవంబగు నీహయమేగావలెను. నేను వనంబుల వల్కలంబులుధరించి కందమూలములఁ దినుచుఁ గాలము గడుపుచున్నాను. అట్టి నన్నుజయింపలేవా? నేను బాలుఁడనని వనవాసినని కరుణింపఁబనిలేదు. కరుణకును శూరునకు నెంతయో దవ్వుగలదు. చేతనైన రణంబొనర్పుము. లేకున్న గృహోన్ముఖుండవుగమ్ము. అంతియగాని చేతఁగానివానివలె మాట్లాడనేల?

సమరమున జయించినఁ గీర్తియు, వధింపఁబడిన వీరస్వర్గము వచ్చును. జయాపజయంబులు దైవాధీనములుగాని మన స్వాధీనములుగావు. వాల్మీకిమునీంద్రుని శిష్యుఁడనై వారికృపారసంబున సమస్తవిద్యలయందును బ్రవీణుఁడనైన నేను నీమాటలకు వెఱచువాఁడనుగాను. నీవేగాదు. ముల్లోకములెత్తివచ్చినను భయపడువాఁడనుగాను. యుద్ధమునకు భయపడి నిన్ను శరణుఁజొచ్చి హయంబునిచ్చునంతటి భీరుఁడనుగానని, ధైర్యంబునఁబలికెను. ఆడింభకసాహసవచనంబులకు లోలోన మెచ్చుకొనుచు శత్రుఘ్నుఁడు 'బాలకా! నిన్నుఁజూచినప్పటినుండియు వాత్సల్య మంకురించుటచే నన్నిఁజెప్పితినిగానిసార్థకనాముఁడనగు నేను నీకుభయపడిగాదు. నాశరంబులు నీమేనఁదగులునప్పుడు నాసత్యాసత్వంబులు నీవు తెలిసికొనఁగలవు. కాచుకొను'' మన లవకుమారుఁడు 'ఇదిగో, నేను సిద్ధముగా నుంటి'నని శరంబొండు ప్రయోగింప నద్దానిని రామసోదరుండు మార్గమధ్యంబుననే ఖండించి తనమనంబున నీతఁడు సకలవిద్యా దురంధరునివలెఁ గాన్పించుచున్నాఁడు. సామాన్యబాలుండని యేమఱిపాటున నుండఁ జన''దని తలఁచుచు నారాయణాస్త్రమును బ్రయోగించె. దాన లవుఁడు మూర్ఛిల్లె.

అంతశత్రుఘ్నుఁడు ''అయ్యో! నామూలమున నీడింభకుఁడు మూర్ఛిల్లెను. నామాటలనీతఁడు పాటింపక దత్ఫలమును భోగెను. ఏలకో! మూర్ఛితునీతనింజూచి యాప్తునిఁగాంచి

నట్లయి పరితాపమునకు లోనగుచున్నాను. అయ్యో! సుకుమారుఁడగు సీతనిరాకకై యాతనితల్లి యెంత దుఃఖించుచున్నదో గదా! జరిగినదానికిప్పుడు వగచిన లాభ మేమి? ఇబ్బాలకుని శ్రీరామసన్నిధానంబునకుఁ గొంపోయెదనని తలఁచి యాతని రథముపై నిడుకొని పోవుచుండెను.

అంత సమీపస్థులగుమునిబాలురు "అయ్యో! మూర్ఛితుండగు లవకుమారు నీరాజమార్తాండుఁడు తన రథముపైఁ బెట్టుకొని పోవుచున్నాడు. ఆశ్రమంబున వాల్మీకిమహామునియు లేఁడు. అయ్యో! యనుచుఁ బరుగెత్తుకొనిపోయి జరిగినవృత్తాంత మంతయు సీతకువిన్నవింప మొదలునఱకిన కదళీతరువువలె భూమిపైఁబడి పొరలి యేడ్చియేడ్చి మూర్ఛిల్లి యెట్టకేలకుఁ దెలిసి "హా తండ్రీ! నీముద్దుమోము వీక్షించి నంతమాత్రమున నెట్టికఠినాత్ములకైనను మనస్సు నీరై పోవును. అట్టిచో నారాజ మాత్రునకు నీపై బాణములుప్రయోగించుట కెట్లు చేతు లాడెను? అశ్వమును విడువుమని చెప్పిన యాతని పల్కులసెసన నాదరంబుచూపి యేల యెదిరించితివి. కుమారా! పాపాత్ము రాలనగు నాకు నీమోముఁజూపినఁబాపమనితలఁచి సాహసమున యజ్ఞహయమును బంధించి శూరశిఖామణియగు క్షత్రియునిచేఁ గూలితివా? తండ్రీ! రాజుచేవిడువఁబడిన నిర్భాగ్యరాలనగు నాగర్భమునఁబుట్టి వనములోఁ గందమూలములఁదిని కాలము గడపితిను నీకుఁ బౌరుషమేటికి? దైవవశమున భర్త విడనాఁడి

నను, నరణ్యములలో వసింపుచున్నను మిమ్ముఁజూచి సర్వంబు మఱచి యానందించుచుఁ గాలము గడపుచుండెడిదానను. అర ణ్యమంతయు సంచరించి, శ్రమపడి పుష్పఫలంబులఁ బ్రీతితో నాకిచ్చుచుండెడివాఁడవు. నీముద్దుమాటల నేనెట్లుమఱతును. హా! కుమారా! నీవులేని యీవిపినవనంబున నేనెట్లుబ్రతుకఁగలను. నీయన్న యేతెంచి నాముద్దుతమ్ముఁడెందుబోయెనని యడుగఁగ నేనెట్టి సమాధానమీయఁగలను.

నీయన్నను నిమిషమైన నెడబాయని నీవు నేఁటిదినంబున నొంటరిగా వనంబున కేలపోయితివి?. చిన్నికుమారుఁడవగు నీతోఁబోరిన యాభూపాలుఁడెవ్వఁడోగదా? దశరధమహారాజు నకుఁ గోడలనై, శ్రీరాముని ప్రియపత్నినై, యిటువంటి దుఃఖ ములు పొందుటకుఁ బూర్వజన్మమందెట్టి పాపంబులనార్జించితినో గదా! కాకున్న నీవంటివానిని బాయుట గలుగదు. హా! కుమారా! హా! సుగుణరత్నాకర! నిన్నుఁజూచుభాగ్య మీ జన్మంబున నాకు మరలఁగలుగునా? చంద్రునకైనఁ గళంక మున్నదిగాని నీముఖచంద్రబింబమునకుఁ గళంకముగాన్పింపదు" అని పరిపరివిధంబుల శోకించుచుండ, గుశుఁడాశ్రమంబునఁ బ్రవేశించెను.

ఆతఁడు తనలో "ఏమి! ఈదినంబున నాశ్రమమంతయుఁ జిన్నపోయినది. మునికుమారులతో నేఁడు నాముద్దులతమ్ముఁడు గానరాఁడేమి? నన్నుఁజూచి తపస్వినులు తలలువంచుకొను

చున్నారేల? నేనువచ్చుటతడవుగా నెదురువచ్చు నాజనని కాన్పింపదేమి? నామనస్సు విచారకలుషితమగుచున్నది. అదిగో! నాతల్లియీసమీపముననే మునికాంతలమధ్యమునగన్నీటితోఁ గాన్పించుచున్న" దనుకొనుచు సమీపించి 'అమ్మా! ఏల నీకన్నులనుండి నీరువఱదకై పాఱుచున్నది. నాముద్దుల తమ్ముఁడెందేఁగెను? నీవావిచారకారణంబును దెల్పి నాపరితాపమును దీర్పు' మను తనయునిఁజూచి, జరిగిన సమస్తవృత్తాంతమును దెల్పెను.

అంతఁ గుశుండు క్రోధశోకంబులు సంధింప "హా! తమ్ముఁడా! పూర్ణచంద్రునిఁబోలు నీమోమునుజూచు కరుణలేక నిన్ను సంగరంబుననోడించి రథముపై తీసికొనిపోయిన రాజెంత కఠినచిత్తుఁడోగదా! హా! శౌర్యసాహసంబులుగల నాతమ్ముఁడు కూలెనా? ఇదికల్ల. నమ్మఁజాల అది మూర్ఛయైయుండనోపు. అమ్మా! నీవు ధైర్యమవలంబింపుము. తమ్మునకేమాత్రము భయములేదు. తమ్మునిఁగొనిపోవుచున్న రాజుందాఁకి కూల్చి, నీసమక్షమునకుఁ దమ్మునిఁ దేకున్న నేను నీపుత్త్రుఁడనుగాను. ఆశీర్వదించి పంపు"మని వేఁడెను. అంత సీత యనుమడించిన దుఃఖముతో 'నాయనా! తమ్ముఁడు కూలుటయేగాక నీవును రణంబునకై సిద్ధపడుచుంటివా? పగతులగు రాజవరులేడ? పసిబాలుఁడవగు నీవేడ? నీవైననీవనంబునకుశలుఁడవై సంచరింపు' మనఁ గుశుఁడు 'అమ్మా! నాయెడల ననుమానమువీడుము.

పదునాలుగులోకంబులొక్కటైన దండెత్తివచ్చినను జండమార్తాండునిభంగి జయింతును. శరముచేఁబూని నిలిచిన నన్నుఁ గాలుండైనను జయింపనోఁపఁడు. వైళంబ యనుజ్ఞనొసంగుము. నీమహాదాశీర్వాదమును బ్రసాదింపు' మన సీత చేయునదిలేక 'కుమారా! నీధైర్యము నిన్నురక్షించుఁగాత! వాల్మీకియొసంగిన యస్త్రంబులు నిన్నుఁగాపాడుఁగాక! పితృవాక్యపరిపాలకుఁడగు రామునకుఁ బరమపతివ్రతయగు కౌసల్యయొసంగిన దీవనలన్నియు నీయెడ సఫలంబులగుఁగాక! ముక్కోటిదేవతలు నీకుఁ గల్యాణంబొనగూర్తురుగాక! వినత, యమృతంబుదేర నరుగు గరుత్మంతునకే యాశీర్వచనంబులొసంగెనో యట్టి యాశీర్వచనంబులు మిమ్ము రక్షించుఁగాక'! యని దీవించి పంపెను. కుశుఁడు శత్రుఘ్నునిఁ దాఁకఁజనెను.



# శ్రీ జానకీ శపథము

## అష్టమ ప్రకరణము



కుశుఁడట్లుచని 'ఓరాజా! నిలువుము. నిస్సహాయుండగు చిన్నవానిని సపరివారసమేతుఁడవై ముట్టడించి ఘోరరణంబునఁ గూల్చి రథంబుపైఁ గొంపోవుచున్నాఁడవా? ఏమి నీశౌర్యము! ఒక్కయడుగైన నీవిఁకసాగఁగలవా? నిన్ను సంగరంబునవధించి, నీకొఱకు నీబంధుజాలము విలపించునట్లొనర్చి నాతమ్మునిం గొని పోయెద" ననెను. ఈవాక్యములువిని 'ఈబాలుఁడెవ్వఁడై యుండనోపు? రథంబున మూర్ఛితుండగు బాలుఁడును నీతఁడును సోదరులై యుందురు. కానియెడ నీతఁడేల నాపైఁగినియును? ఆహా! ఈడింభకులయందు శ్రీరామసామ్యము గాన్పించుచున్నది. వనవిసర్జిత సీతాసుతులు వీరుకారుగదా! ఏమి! పసితనముననేవీరిశౌర్యము! రామునితనయులగుచో వీరిసాహసంబు ప్రమోదావహము. అయ్యో! ఎంతవెఱ్ఱివాఁడను. అరణ్యముల పాలుచేసినసీత యేపులులనోటఁ బడియుండెనో? వీరెట్లు సీతా

పుత్రులగుదురు? ఈబాలుఁడు రథమునక్కి ధనుర్బాణసహితుఁడై నిల్చియున్నాఁడు. వీనితో రణంబుసేయుటెట్లు? సామవాక్యంబుల వీనిని బుజ్జగించిచూతు'నని తలఁచి 'కుమారా! పడియున్న నీతమ్మునియవస్థను విలోకింపుము. పౌరుషమువిడిచి పొమ్ము. వ్యర్థముగ నీమనోహరరూపంబును నాశరముల పాలు చేయకుము. నీతల్లిని సంతోషపెట్టు'మను వాక్యంబులువిని యుగ్రుఁడై 'రాజా! మునిబాలుఁడనుగాను, నీపాలిఁటి కాలుండననితలఁచి సంగరంబునకుఁరమ్ము! ధైర్యవిహీనుండవైన శరణుపొందు'మనెను. ఆమాటలువిని ''ఏమి! నీసాహసోక్తులు. నీశౌర్యోక్తులకానందించితిని గాన నింతవరకుపేక్షించితిని. నావచనంబులువినుము. బ్రాహ్మణకుమారుండవగు నీకు రణంబుసేయుట తగనిపని. సౌందర్యరాశివియు లేఁబ్రాయపు సిసుఁగువగునిన్నుఁ జూచినదిమొదలకారణంబుగ నీయందు వాత్సల్యమంకురించినది. ఎన్నిచెప్పిననువినక నీతమ్ముండు నాబాణాగ్నిపాల్పడెను. నీపై బాణప్రయోగంబొనర్ప నాచేతులు వెనుదీయుచున్నవి' అనెను. ఈమాటలువిని కుశుఁడు 'భీరుడా! సమరమునకు వెఱచి తప్పించుకొనఁ బోవఁదలఁచితివా? అనునంతలో రథస్థుఁడగు లవుఁడు మూర్ఛఁదేరి రథంబునుండిలంఘించి పరిశయరుదారిక్రతిని మండిపడుచు 'రాజా! మూర్ఛితునన్ను నిర్జీవునిగానెంచి నన్నుఁగైకొని పోవుచుంటివా? నిలుము' అనెను. లవునిఁజూచి సంతుష్టాంతరంగంబునఁ గుశుఁడు ద్విగుణీకృతకళలతో విలసిల్లెను. అంత శత్రుఘ్నుఁడు 'వీరశ్వనీదేవతలవలెఁగాన్పించు

చున్నారు. నన్నుఁబరీక్షించుటకు వచ్చిన దేవతలుకారుగదా! వీరి యెడ దయఁదలఁపరాదు' అనుకొనుచు 'మునికుమారులారా! బ్రాహ్మణధర్మంబుగాదంటిని గాని మీకు వెఱచిగాదు' అని తీవ్రశరంబులేసి యించుక కుశుండద్దానినిఖండించి పరిహసించి హెచ్చరించి వేఱొండుబాణమునేసి 'నీవు పాతాళముఁజొచ్చినను, ద్రిమూర్తులడ్డినను నిన్నియ్యది భూమింగూల్చుననుచుఁ బ్రయోగింప శత్రుఘ్నుఁడు మూర్ఛిల్లెను.

అంతఁగుశుండు తమ్మునిఁగౌగిలించుకొని 'మనకొలఁకాశ్రమంబున నమ్మవిచారించుచుండును. పోవుదము రమ్మ'ని యాశ్రమంబునకుఁజనెను. ఇంతలో నానందంబున మునికాంతలు సీతతో నీవృత్తాంతము విన్నవింప సమందానంద భరితాంతరంగయై యొక్కకుశుఁడే వచ్చుచుండెననుకొనుచు నెదురుగా వచ్చెను. కుశలవులిరువురును దల్లికి నమస్కరించి జనని యాశీర్వాదంబులఁబొందిరి.

శత్రుఘ్నుని పరాజయమును హతశేషులగు వీరులు పోయి శ్రీరామునితోఁజెప్పిరి. అంత శ్రీరాముఁడాశ్చర్య దుఃఖంబులు పెనఁగొన 'మునికుమారులేమి! శౌర్యశాలియైన శత్రుఘ్నునిఁ గూల్చుటయేమి! వారెవర'న నాసేవకులు స్వామీ, 'వారెవరో యెఱుంగము. వారిరూపశౌర్యంబులు మిమ్ముఁదలఁపించుచున్నవి. మునివేషధారులైనను వారిముఖంబుల మహాచక్రవర్తి లక్షణంబులు గాన్పించుచున్నవి. తద్వాక్యకౌశలంబును, యుద్ధప్రవీణతయు వర్ణనాతీతంబులు'అనిరి. అంత రాముఁ

డు భరతుంజూచి "తమ్ముఁడా! మనలంబోలు నాముసికుమారు లెవ్వరో గనుంగొని పసిబాలురుగావున బుజ్జగించి యజ్ఞహయం బును దెమ్ము" అని యాజ్ఞాపించెను.

భరతుండు రామాజ్ఞనౌదలఁదాల్చి సేనలతో సంగ్రామభూమిని బ్రవేశించి మూర్ఛమునింగిన తమ్మునింగాంచి 'హా! సోదరా! నీశౌర్యమేమయ్యెను! క్షత్రియధర్మవ్యతిరేకముగ నాయుధమ్ములు నేలపాలొనర్చి కఠినభూస్థలియందుఁ గూలితివా? పసిబాలురచే నోడుటయేమి?" యని యనేకవిధంబుల విలపించి 'నిన్నుఁజంపిన బాలురఁజంపి దుఃఖమార్చుకొనెదను. యజ్ఞాశ్వంబును గొనిపోయెద'నని తలంచుచుండ, భరతుఁజూచి కుశలవులు వికటాట్టహాసంబొనరించి 'యుద్ధరంగముః జచ్చినవానింపైఁబడి యేడ్చుచున్నాఁడవు. ఇది క్షత్రియ ధర్మమేకాఁబోలు. నీనామధేయమెయ్యది"యని యెకసక్కెంబులాడిన భరతుండు వారలఁదేరిపాఱఁజూచి, 'అహా! ఏమి వీరి సౌందర్యము! రామాజ్ఞచేత లక్ష్మణుండడవులవిడిచిన సీత యొక్కతనయులు వీరుగారుగద! శ్రీరామ శుభరూపరేఖా విలాసంబులు, జానకీశరీరచ్ఛాయయు వీరియందు సువ్యక్తంబులు' అని తలంచి వారితో 'బాలులారా! శ్రీరామునితో మీకున్నైరమేటికి మిమ్ముఁజూచినదిమొదలు మీతో యుద్ధము చేయ నిచ్ఛలేదు. యజ్ఞహయమునువిడిచి నాతో సాకేతంబునకువచ్చి పరంధాముఁడగు రామునిదర్శించి ధన్యులరుకండు

నేను రామునితమ్ముఁడను. భరతుఁడను. మీకజేయుఁడ"ననెను. అంత వారు పెదవివిఱిచి 'ఏమేమీ! బీరములుపలుకుచుంటివి. నీతమ్ముఁడు మచ్ఛరాగ్నిముఖంబునఁ గూలుటఁగాంచియు నీవిట్లు పలుకుటంజేసి మాకునవ్వువచ్చుచున్నది.' అనిరి. అంత భరతుఁడు 'బాలకులారా! మీపరాక్రమంబునకు భయపడి నాసోదరుఁడుగూలలేదు. పసిబాలురగు మీపైఁగినియక బాణంబులు సంధింపక మీచే శత్రుఘ్నుఁడుపడె'ననెను. అంత వారూరకుండక 'అన్నను వదినెను ఘోరాటవులకుంద్రోలి తగుదు పనిరాజ్యమేలఁజూచిన స్వార్థపరుండవగుసీవు మాదృశులసన్నిధ బీరంబులు పల్కఁబనిలేదు. చేతనైన యుద్ధముసేయుము. లేకున్నఁబొమ్ము' అనిరి. అంతభరతుండు క్రుద్ధుఁడై బాణసంధానమాచరించి ప్రయోగింపఁ గుశుండు వెంటనే దానినిఖండించి 'ఓవనదేవతలార! మాజనని సాధ్వీతిలకమేని నియ్యది వాల్మీకిమంత్రపూతాస్త్రంబులేని పీటిచే భరతుండు మూర్ఛిల్లుఁగాత!" యని విడువ భరతుండు మహామారుతంబునఁగూలిన భూజరాజంబుపగిది నేలంబడె.

సోదరులగు భరతశత్రుఘ్నులు సమరమునఁ గూలిరని విని శౌర్యశాలియైన లక్ష్మణుండు యుద్ధమునకువచ్చెను. ఆతనిఁ జూచి బాలకులు 'తాత రామాయణముచెప్పునపుడు సీతారామ వనవాససందర్భమున, సర్వసౌఖ్యంబులను వర్జించి రాముని సేవించిన యాతఁడీతఁడే కావలయుననుకొనిరి. అంత లక్ష్మ

ణుండు తద్వనస్థలంబున సీతజ్ఞప్తికిరాఁగా 'హా! తల్లీ! లోక మాతా! పాపాత్ముఁడైన యీలక్ష్మణుఁడు నిన్నిపాంతముననే గదా విడిచిపోయెను. నీవేమైతివో. నిన్నేనన్యసత్వములు కబళించెనో! కఠోరరామాజ్ఞచే నిన్నియరణ్యమున దిఁచుటంజేసి దీనినిఁజూచుతఱి నాకు దుఃఖముగలుగుచున్నది. నాధైర్యము సన్నగిల్లెను. ఈసంగరంబున జయంబు బొందఁగలుగుదునా?' యని తలపోయుచు బాలురఁజూచి యాశ్చర్యముతో! ఆహా ఏమి వీరిచక్కదనము! ఏమి వీరిగాంభీర్యము! వీరు రఘుకులోద్ధారకులుకారుగదా! అంతటియదృష్టమా! వీరితో యుద్ధము చేయ హృదయంబిచ్చగింపకున్నది. వీరెవ్వరో కనుగొందును అనితలఁచుచు వారితో 'బాలకులార! మీరెవ్వరు? శ్రీరాముని యుద్ధంబుపొనర్చుట మీకుఁదగునా! ఆతఁడు పరంధాముఁడుగాని నరుండగు రాముండుగాఁడు దైత్యకులసంహారంబు గావించి భూభారముతగ్గింప నవతరించిన విరాడ్రూపుఁడగు విష్ణుమూర్తి. అతఁడు ముల్లోకంబులకువేల్పు. దీనశరణ్యమూర్తి. రాక్షసేశ్వరుఁడగు రావణుని సురలుమెచ్చుభంగి సంహారించెను. అట్టిశ్రీరాముని గెలువఁజాలరు' అనెను. అంతవారు 'రాజా! నీవుచెప్పవలసినమాటలు చెప్పితివి. ధరణీతలము కుంగినను, సూర్యచంద్రులు గతులుతప్పినను, పాథోనిధానంబు లింకినను, మేముపట్టినపాయము మాటలతో విప్పువారముగాము. రాజోత్తమా! శ్రీరాముండు విష్ణుస్వరూపుండని వినుటచే మాకు సమరోత్సాహంబు మెండగుచున్నది. అట్టివానిం జయించినఁ

నిత్రిలోకవిఖ్యాతి మాకుఁగలుగును. అతనిశరంబులఁ గూలిన మోక్షలక్ష్మి మమ్ము వరించును' అనిరి. అంత లక్ష్మణుండు 'డింభకులార! నేవచించువాక్యంబుల నాదరింపుఁడు. శ్రీరాముండు భూసురులవధింపఁడు. మునిపుత్రులగు మిమ్ముఁగూల్ప నాకును జేతులురాకున్నవి. కావున హయంబును విడువుఁడన వారు 'ఓయీ యేమిమాటలాడితివి. రాముఁడు భగవంతుఁడని చెప్పి హయమును గొంపోవచ్చితివా? పాపము! అన్న మెప్పు పడయఁగోరికాఁబోలు! వచ్చితివి. నీమాటలకు మోసపోవువారిం డెవ్వరును లేరు. జయించినవారికి రాజ్యమిత్తుమని యశ్వ లలాట పట్టికయందు వ్రాసినారు. అందువలన హయమును బంధించితిమి. చేతనైన యుద్ధంబొనర్పుము. లేనియెడలఁ బొమ్ము' అని తీవ్రముగాఁబలికిరి. అంత లక్ష్మణుండు 'బాలకులార! ధర్మ మార్గంబునరయుఁడు. వేఱొండుమార్గంబునఁద్రొక్కుట మీకుఁ దగదు. శ్రేయోదాయకముగాదు' అనెను. అంతవారు నిలువక 'ఓహో! ధర్మోపదేశంబొనర్ప నీవువచ్చితివా? అన్న చెప్పినంతనే ధర్మాధర్మంబులు విచారింపక నిర్మలచరిత్రయగు భూజాతను నీవేగదా! యడవిపాలుగావించితివి కులసతుల నడవి పాల్చేయుట రఘువంశపు మర్యాదయగునా? ఓహో! మఱచితిమి. మీయింటఁ బతులనుజంపు నాడువాండ్రును, సతులను విడుచు మగవారునుగలరు. నీవామహాసాధ్వి నడవిపాల్చేసిన మహాపాపంబునకు సిగ్గుపడి శిరంబువంచుకొనక యుద్ధమునకుఁ దగుదునని వచ్చితివా'యని యత్యంతము మర్మంబులఛేదించు

మాటలఁబల్కి లక్ష్మణుఁడు నీరవుఁడై, నిశ్చేష్టితుఁడై, 'హా! దైవమా! నాయకార్యంబునకుఁ జిన్నిబాలురుకూడ దెప్పుచున్నారు. పుత్రవాత్సల్యంబున బదునాలుగేండ్లాదరించిన మహాజనని, నకారణంబుగ నడవిపాలుఁజేసినదిమొదలు మాకెల్లెడల నపజయమే గలుగుచున్నది. సీతాపరిత్యాగ సంతాపభరంబునఁ గుందిన మాకీయర్భకుల వాక్యంబులు ములుకులై హృదయ విదారణంబొనరించుచున్నవి. 'ఓతల్లీ! సుగుణకల్పవల్లీ ఏవన మృగంబులపాలైతివోగదా! చేతులార నిన్నువిపినభూముల పాలొనర్చిన మహాపాపంబు శతజన్మంబులకైనఁ దీరునా? ఈలక్ష్మణుండు లక్ష్మణుండుకాఁడు. సజ్జనభక్షకుండైన మహాపాపి. హా! అల్లదే, కన్నుల నీరుస్రవింప నేడ్చుచు నాదెసనెల్ల జానకి చూచుచున్నదో! అయ్యో! దుర్భరము! నిర్భరము' అనుచు మూర్ఛిల్లెను.



# శ్రీ జానకీ శపథము.



## నవమ ప్రకరణము



అంత సైనికులు పోయి రామునితో సీవిషయము విన్నవించిరి. తోడనే రాముఁడు మహత్తర శోకాగ్నిపరితప్త మానసుఁడై కొంతవడికి ధైర్యము తెచ్చుకొని చండమార్తాండోగ్రమూర్తియై యుండ నాతనిఁ జూచి హనుమంతుఁడు "ఆహా! నేనెప్పుడిట్టి యుగ్రాకారమును గాంచియుండలేదు. సుగ్రీవ రక్షణార్థము వాలిని దునుమునప్పుడైనను గరాళరూపుండగు రక్షోనాయకుండునగు కుంభకర్ణుని వధించునాఁడైనను, భువనకంటకుఁడైన రావణుని సంహరించు సమయమందైనను నిట్టి యుగ్రరూపమును నేను జూచియెఱుఁగనే. ఆతీవ్రభంగి చూడ ముల్లోకంబుల భస్మీభూత మొనర్చునేమోయని భయమగుచున్న"దని తలఁచుచు రామునిఁజూచి "శ్రీరామచంద్రా! శాంతింపుము. మహాత్ములును త్రైలోక్యవందితబలపరాక్రమసంపన్నులునగు మీయనుజులేమి? సంగరమునఁగూలుటేమి!

అయ్యది మూర్ఛయై యుండనోపు" నని యోదార్చెను. అంత రాముఁడు పవనజునిఁ జూచి గరుడునిఁ దోడ్కొనిరా నియమించెను. పవనజుఁడు స్వర్గమునుండి గరుడునిఁ దెచ్చి ప్రయాణమున కాయత్తముచేసెను. అంతరాముఁడు వినతాసుతు నధిరోహించి తరలుచుండ జయజయ ధ్వనులు నలుదెసలఁ జెలఁగెను.

దేవతలు పుష్పవర్షమ్ము గురియించిరి. కొందరానంద వివశులై రామునిఁ జేరొ్కని భేరీలను వాయించుచుండిరి. సీతాపతియనియు, దశరథ తనయుఁడనియు, దశాస్యహరుఁడనియు వర్ణించుచు భక్తి పరాధీనులగు ప్రజాసమూహము తాండవంబాడసాగె. అనంతసేనా సముద్రంబు వెనుకరాఁ, నక్షత్రాధిపతియగు చంద్రుని చందంబునఁ గళా పూర్ణుఁడైన రాముఁడు యుద్ధమునకు వెడలెను. అందరును యుద్ధభూమిఁ జేరిరి. అట రాముఁడు మూర్ఛితులగు సోదరులను జూచి నిర్భరదుఃఖాతిరేకంబున "హా! పసిబాలురచేఁ గూలితిరే! లక్ష్మణా! లోక కంటకుఁడగు రావణుని కుమారునిఁ జంపిన నాఁటి నీశౌర్యము నేఁడెందేఁగెను. రావణశక్తికి ధైర్యంబునునిల్చిన నీసాహస ధైర్యంబు లెచ్చటఁజొచ్చెను? పదునాలుగువత్సరంబు లాహార నిద్రలు మాని సీతకును నాకును నెట్టి యుపచారములు చేసితివి. నేను జానకి నెడబాసి దుఃఖించుతరి నాయండనిల్చి సీతను గూర్చి పట్టముగట్టి నిద్రపోయితివి హా! భరతా! పవిత్ర హృదయా! సుకుమారుఁడవయ్యుఁ దపసివై నాపాదుకల పదునాలుగేండ్లర్చించిన మహనీయుఁడవు, శతృఘ్నా! నీసార్థక

నా మమ్ము నేఁడీగతిని వ్యర్థముచేసితివేమి? రావణాసురునిఁ గూల్చిన నీపటుతరభుజాబలం బేమయ్యె"నని యనేక విధముల పలవించి హనుమంతునిఁ జూచి "ఆంజనేయా! సోదరులు లేని రాజ్యము నాకేల"యని ధైర్యమును విడచి యాక్రందనము చేసెను.

ఇంతలో మునిపుత్రులు కుశలవుల సన్నిధికిఁ బోయి "బాలకులారా! ఇదివరకు గెల్చితిమని సంతసింపకుఁడు. ధైర్య సాహసములు గల్గిన రణవీరులైన వానరులు నేలయీనిన చందంబున రామునితో పోరుపైకి వచ్చియున్నారు. ఆసైన్యమును జూచిన మాశరీరంబులు గంపించుచున్నవి. సైన్యమును జూచి నిలువఁజాలము. మిమ్ము విడిచి పోఁజాలము. శరణాగతరక్షకుండగు రామునకు యజ్ఞాశ్వమొసంగి శరణుపొందు"డనిరి. అంతఁగుశలవులు 'మునికుమారులారా! రణములో రామునితోవచ్చిన వీరులెవ్వ'రని యడుగ వారు 'మిత్రులార! నల్లని మైచాయగలిగిమూడు భయంకరులగు పెక్కురక్కసులతో విభీషణుఁడును ముష్టిఘాతనిర్జితాఖిల శత్రుకదంబుండగు జాంబవంతుఁడును, వచ్చి"రని చెప్పుచుండఁ గుశలవులు "భీరులార! కోతులనుజూచి భయపడితిరా! ఈసైన్యమంతయు మాయిద్దరికొకటికేనా!" యన మునికుమారులు, "అన్నలార! పరిహాసవచనంబులు విడువుఁడు. రామరావణ యుద్ధంబున సుగ్రీవాదులొనర్చిన సాహసకృత్యంబులు వర్ణనాతీతంబులు.

ఆసుగ్రీవుఁడుకూడ వచ్చినాఁడు. రామనామజపపరాయణుం డును, లంకాదహనమొనర్చిన, వాయుపుత్రుండైన ప్రఖ్యాతిఁ గల హనుమంతునితో మీరు పోరఁజాల"రనఁ గుశలవులు, "మీకు భయమైనయెడల మీరుపొండు. వానరులైనను, సురలైనను, నెవ్వరైనను మేము జయింతు"మనిరి. ఈమాటలు విని యావిప్రబాలకులు చేయునదిలేక దూరముగా నిలుచుండిరి. ఇట్లుండ సుగ్రీవుఁడువచ్చి "శ్రీరామునితో యుద్ధముచేయ మీకుఁదగదు. బాలకులార! నేను సుగ్రీవుఁడను. యజ్ఞహయ మును విడువుఁ"డన, వారు "నీవేనా సుగ్రీవుఁడవు. నిన్ను గూర్చి రామాయణములోఁ జదివితిమి గాని నిన్ను నేఁటివరకుఁ జూడలేదు. చాలు! నీప్రతాపము. అన్నను బరునిచేఁ జంపించి కిష్కింధను దగుకొనని యేలుచుంటివి. మీరాముఁడాలి నడ వుల పాలుచేసి తమ్ములనుగూడి రాజ్యమేలుచున్నాఁడు. నీకును నీరాజునకును సరిపోయినది. కోతిచేష్టలుమాని పోయి మీరాజు తో మేము హయమును విడువమని చెప్పుము. రాజగు రాము నితోనే యుద్ధమునకుఁ దలపడుదుము గాని నీతోఁదలఁపడ" మని పలికిరి. ఈనిందావాక్యంబులు విని రామునకు సుగ్రీవుఁడు విన్నవింపఁగా నతఁడు "విభీషణా! నీవుపోయి బాలురనువధించి హయమును గొనిరమ్ము"న నాతఁడు "తామేమాజ్ఞాపించిన నొనరింతును గాని బాలుర దరికిఁ బోనని విన్నవింపఁగా, "విభీ షణా! భయపడుచుంటివి గాఁబోలు. నీకు దీర్ఘాయువు గలుగు

నట్లు వరమిచ్చితిని. పొమ్మ”నఁగా విధిలేక లంకాధిపతి బాలుర సన్నిధికి వచ్చి “ఓమునికుమారులార! అశ్వమును విడువుఁడు. విడువకున్న మిమ్ము నవధించి యశ్వమును దీసికొని రా, రామాజ్ఞయైనది. నేను రాక్షసేశ్వరుఁడనగు విభీషణుఁడ” నని పలుకఁగా వారు పకపక నవ్వి “నీవేనా విభీషణుఁడవు? రాక్షస రాజవైనంతమాత్రమున నీకు భయపడి హయమును వదలు వారముకాము. లంకగుట్టు నా రామునకుఁ జెప్పి యన్నను జంపించి రాజ్యమేలు నీకును సతి నడవిపాలు చేసి రాజ్యముచేయు రామునకును సంబంధము బాగుగాఁ గుదిరెనది. సిగ్గులేక యెట్లు వచ్చితివి. మేము రాజులతో యుద్ధము చేయుదుముగాని బంట్లతో యుద్ధము చేయము ఈమాట మీస్వామికి విన్నవించికొను”మన ములుకులవంటి యీపలుకులకు శృంగభంగము సేయఁబడిన మహిషంబు పగిది విభీషణుఁడు రామునివద్దకుఁ బోయి సర్వమును విన్నవించెను. మఱియు “స్వామీ! ఆబాలుర రూపంబులు మరువరానివి. వారల శౌర్యంబులద్వితీయంబు”లని పలికెను. అంత రాముఁడు క్రోధానల దహ్యమానసుఁడై భద్రగజారూఢుఁడై సురలు సేవింప వెడలు దేవేంద్రునిభంగి సంగరంబున కరిగెను. అంతఁ గుశలవులా తేజస్స్వరూపునిఁ జూచి విస్మయపడి “ఆహా! ఏమి సుందరాకారము! దేహచ్ఛాయ నీలమేఘమును నిరసించుచున్నది. కన్నులు కంజాతముల మించుచున్నవి. వక్షస్థలంబు వజ్రపంజర నిభమై యున్నది. మోము పూర్ణచంద్రునిఁ బోలి

యున్నది. నవరత్న ఖచితమైన కిరీటము శిరంబుపై మెరయు చున్నది. ధనుర్బాణములు శరణాగత రక్షణ బిరుదంబునువ్యక్త పఱచుచున్నవి. మనము చదివిన రామవర్ణనమంతయు నీవ్యక్తి యందు సరిపోవు చున్నది. ఈతఁడే శ్రీరామచంద్రుఁడు. అశ్వ మునుబంధిచి తమ్ములనుగూల్చితిమను కోపంబునఁ ద్రిపురంబుల పైకెత్తి వచ్చు శూలిచందంబున మనపైకి వచ్చియున్నాఁడని తలంచుచుండిరి. అంతట రాముండు గజంబుడిగ్గి రాజకళావిలా సులగు బాలురఁగాంచి యొకవిధంబగు మానసికావస్థకులోనై "అహా! ఏమి! వీరినిఁజూచినతోడనే నాకోపము భస్మమైనది. నామనం బానందసాగరంబున నోలలాడుచున్నది. మన్మథుని మించిన చక్కదనంబులు పేరికెచ్చుటనుండివచ్చెను. వీరెవ్వరో యూరసెద"నని వారినిఁజూచి "కుమారులార! భీకరమైన యటవీస్థలంబున నెవ్వరి కరుణాకటాక్షంబునంజేసి యిట్టి యసా ధారణ ధనుర్విద్యాకౌశలము మీకలవడెను? రణంబుసేయుట మునికుమారుల కధర్మముగదా! ఆశ్రమధర్మవిరుద్ధమును, విప్ర కులధర్మనిషిద్ధము నగుయుద్ధము విజ్ఞానశీలురగు మీకుఁదగునా? భూపతులతోఁ దాపసులకు వైరముతగదు. తెలియక హయ మును బంధించితిరి. ఇఁకనైనను హయమును విడువుఁ"డన వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి, "రామా! మేము యుద్ధమును గోరియే యజ్ఞహయమును బట్టితిమి. జయమైనఁ బడయవల యును. లేదా సంగరమునఁ బ్రాణములనైన విడువవలయు" ఈమాటలకు శ్రీరాముఁడు "బాలకులార! ఇంత చిన్నవయ

స్నన మీకంత పట్టుదలయెందులకు? మీపై బాణములువేయుటకు నామనస్సంగీకరించుటలేదు. నేను యుద్ధముచేసిన మీరు నిలువఁజాలరు. మిమ్ముసంహరించిన బాలురవధించెనను నపకీర్తి నాకు వచ్చును. సాటిరాజులే యింతపనియొనర్చియుండిన నీపాటికి నాచేఁ గూల్పఁబడియేయుందురు. ముద్దులొల్కు మీముఖపద్మములను వీక్షించి బాణమోచనం బొనర్పఁజాలకున్నాఁడను. మీ శౌర్య సాహసంబులంజూచి సంతోషించితిని. చెవులార మీచిన్నిపల్కులువిని మీతోఁబోర వెనుదీయుచున్నాను. మిమ్ముఁజూచినదిమొదలు మీపైఁ బుత్రవాత్సల్యం బుదయించుచుండుటచే ఘోరబాణముల విడువనేరకున్నాఁడ. నాబాణంబులు పూజకై కోయు పూవులవంటివిగా”వన విని కుశలవులు “శ్రీరామచంద్రా! నీయానతి శిరసావహించుటకంటెఁ బ్రశస్తమైన సత్కార్యము జగతిలో లేదు. కీర్తికొఱకు సాహసంబున బంధించితి”మనిరి. అంత రాముఁడు “డింభకులార! మీవంశక్రమమేమి? మీనామంబులెయ్యవి? మీరు సంగరముగోరియే హయమును బంధించితిరా? ఆలమున గరవాలములతోఁ బనిగాని పుష్పమాలలతోఁ బనిలేదు. శత్రువులను నిర్జించుటకు శస్త్రములుగావలెనుగాని శాస్త్రంబులు పనికివచ్చునా. పోరునఁ బోటులతోఁబనిగాని మాటలతోఁబనికాదు. భూసురోత్తములకు వేదశాస్త్రములు చెల్లుఁగాని రాజపుత్రకులతో యుద్ధంబు సెల్లునా? ఇదివరకు జయించితిమని గర్వపడకుఁడు. నేను దేవతలుస్తుతింప ధరణీభారముఁ బాపితిని. దైత్యశ్రేణిని దునుమాడి

తిని. పసిబాలురుగావున మీకు హితముచెప్పుచున్నా"ననెను. కుశలవులు శ్రీరాముని వాక్యములువిని, "రామచంద్రా! నీసత్కథా మహిమాతిశయంబులగు కావ్యము లత్యంతాను రాగముతో మాతాతయగు మునిపుంగవుఁడు మాచేఁ బఠింపఁ జేయుచుండును" దైనస్వరూపుఁడవనిమాచిత్తమందు మొక్కు చుంటిమి. పతిశాపవశముచేతఁ బాషాణమయిన రాతిని నీపాద ధూళిచే నాతిగాఁజేసితివి, భక్తితో శబరి రుచిచూచియిచ్చిన ఫలములుభుజించి యామెకు ముక్తినొసంగితివి. శత్రునితమ్ముఁ డనియైనఁ దలంపక విభీషణునికి శరణమిచ్చితివి. రామచంద్రా! నీవు రాజమాత్రుండవుగావు. దైవాంశసంభూతుండవు.యుద్ధము చేసిననీతోఁడనే చేయవలయు"నను బాలకులవచనంబులు శ్రీరాముఁడువిని "ఏమి! నాచరిత్రను కావ్యముగ వ్రాసి యుండెనా? బాలకులారా! ఇంక నామాటవినరు గనుక క్రూరాత్ముఁడైన లంకాపురాధీశ్వరుఁడగు దశవదనునిఁ దునుమాడిన యావరశస్త్రము మీపైఁ బ్రయోగింతును. బాలకులారా! ఇపుడైన నాలో చించుకొనుఁడు. నాకరమందుండి శరము విడిచితినేని మీప్రాణ ములు మీకు దక్క"వను వాక్యములు కుశలవులువిని, "రామా! మమ్మేల బెదరించెదవు? మాకు మాతల్లియొక్క యాశీర్వాదములును మునీశ్వరులు కృపతోనొసంగిన దివ్యా స్త్రములును మమ్ము రక్షింపఁగలవు. ధరణీభార నివారణంబు కొఱకు భాస్కరవంశమందు దైత్యశ్రేణిఁ గూల్చుటకునవతరిం చిన. రమానాథుఁడవని మేమెఱుఁగుదుము.జగములకుఁ దండ్రివి

గావున మాకుఁగూడఁ దండ్రివేయగుదువు. నీమాటలువినకుం డుట మాకు ధర్మముకాదు. అయినను సమరోత్సాహంబుచే బంధించిన యశ్వరాజము విడువఁజాలము. లక్ష్మధరా! నిన్నుఁ గెల్చినఁద్రిలోకఖ్యాతి చేకూరును. నీకరంబులందు మేము తెగిన మోక్షముపొందుదుము. అంతేగాని సమరమునకు వెనుకదీయము కీర్తి కొఱకే యజ్ఞహయమును బంధించితిమి. సంశయింపకుము, రణభిక్షనొసంగి"మను కుశలవుల ధృఢవాక్యంబులు శ్రీరాముఁ డువిని బాణము సంధింపఁ గుశుఁడు దానినిఖండించెను. తిరిగి శ్రీరాముఁడు "బాలకులారా! యీశస్త్రము మీప్రాణములఁ దీయు"నని విడువఁగా లవకుమారుడద్దానినిఁ ముత్తునియలుగా వించెను. అంతట రాముఁడు రౌద్రాకారంబున నాగ్నేయాస్త్ర ముఁవిడువ నది మంటలుమండుచు బాలురపైకి వచ్చుచుండెను. బాలకులు ధైర్యముతో, "రామబాణమా! మేమే వాల్మీకి శిష్యులమైనయెడల మాతల్లి పతివ్రతాతిలకమైనదో మాపైకి రాక పుష్పమాలవగు"మనిరి. వెంటనే బాణముపూవులాయెను కుశలవులు చప్పట్లుగొట్టి నవ్వుచుండిరి. రాముఁడదిచూచి బ్రహ్మా స్త్రము సంధింపఁగా ముల్లోకంబులు గజగజ వణకుచుండెను. ఇంతలో వాల్మీకి ప్రవేశించి, "రామా నీబ్రహ్మాస్త్ర ముపసం హారముగావింపుము పసిబాలకులను దునుముటపాడిగా"దనెను. వాల్మీకి వాక్యంబులు రామచంద్రుఁడువిని బ్రహ్మాస్త్రముపసం హరించి "మునీంద్రా! యీబాలకులెవ్వరో తెలుపవేడెద" ననఁగా వాల్మీకి బాలకులను సమీపంబునకుఁబిలచి, "కుశలవు

లారా! యీమహానుభావుఁడే మీతండ్రి, నాయాశ్రమమం దున్న మీతల్లియే లక్ష్మీస్వరూపురాలైన సీత. మీతండ్రికి నమస్కరింపు”డని యాజ్ఞాపింపఁగాఁ గుశలవులు సంతోషసాగ రంబునమునిఁగి తండ్రిపాదములపైఁబడి “రామచంద్రా! శరణు శరణు! గాధేయుని యజ్ఞమురక్షించినవాఁడవును శివధనుస్సు దేవ తలు మెచ్చునట్లు విఱచినవాఁడవును బరశురాముని భంగము గావించినవాఁడవును రావణునివధించి దేవతలను రక్షించినట్టి మహానుభావుఁడవునగు నీవే మాతండ్రివి”మహారణ్యమందునీచే విడువఁబడిన జానకీదేవియే మాతల్లియని యిప్పుడీమునీశ్వరుఁడు చెప్పెను. హయమునుబంధించి మిమ్ము శ్రమలపాలుచేసితి”మను వాక్యములు ముగిసినతోడనే వాల్మీకి, “రామచంద్రా! ఈకు మారులు నీకుమారులు. సీత పతివ్రతాతిలకముగాన నేనురక్షిం చితి”నను వాల్మీకివాక్యంబులు రామచంద్రుఁడువిని కుమారు లను గౌగిలించుకొని, “వత్సలారా! మిమ్మెంతకష్టముల పాలు చేసితిని. పూలపాన్పులందునఁ బవళింపవలసినమీరు దర్భాస నములఁ బరుండియుంటిరా? సకలభోగముల ననుభవింపవలసిన మీరు కందమూలములఁదినుచు ఘోరారణ్యమందు సంచరిం చుచుంటిరా”యని దుఃఖింపసాగెను. అంతట కుశలవులు వాల్మీకిపాదములపైఁబడి “మహాత్మా! జనకుని క్రతువాజిఁ బంధించి పినదండ్రులఁ గూల్చితిమనునింద భరింపఁజాలము, వారలను బ్రతికింపుమనివేఁడగా మునీంద్రుఁడు కమండలోద కము నంబ్రోక్షించి వారినందఱను మూర్ఛనుండి తప్పించెను.

# శ్రీ జానకీ శపథము.



## దశమ ప్రకరణము



సీతామహాదేవి శ్రీరామచంద్రునిఁ గూడుకొనను సంతోషముతో దినకరుఁడుదయశైలంబున నుదయించెను. సీతామహాదేవి పరితాపము నేఁటితోఁదీరుననిగాఁబోలు ముకుళించుకొనియుండిన పద్మములు వికసింపసాగెను. రామచంద్రుఁడు దన యనుష్ఠానంబులు దీర్చికొని సభామందిరమునఁ బ్రవేశించి యజ్ఞవాటికయందున్న ఋషీశ్వరులను వానరులను రాక్షసులను రాజవర్యులను విప్రులను పీరువారుననేల సమస్తజనులను రావించెను. వచ్చినవారందఱు సీతనెప్పుడు గనుగొందుమా యను సంతోషముతోఁ నామె రాకకెదురు చూచుచుండిరి జనులందఱు వచ్చినజాడ తెలిసి, వాల్మీకమునీంద్రుఁడు వచ్చుచుండెను. మునివరునివెంట ధరణీతనయ మోమువాల్చుకొని దశరథరామునిఁ దనమనంబున ధ్యానముచేయుచుఁ బద్మముల వంటి కన్నుల నుండి వచ్చు నీటి నాపుకొనుచుఁ గరములు

మోఁడ్చి వచ్చుచున్న భూసుతను జనులుచూచి ఘనతరమైన శోకముతోడ "తల్లీ! నిన్నెన్ని వర్షంబులకుఁ జూడగల్గితిమి? ఆరాముసకుఁదగినటువంటి యిల్లా"లను వచనంబులు సభాభవనంబున మారుమోఁగుచుండ వాల్మీకియు సీతయుఁ గుశలవులును బ్రవేశించిరి. వాల్మీకి రామునిఁజూచి "రామచంద్రా! జానకీదేవి సువర్తితాత్మ, ధర్మశీల నీవు లోకాపవాదికు నీసాధ్వీలలామను మత్తపోవనప్రాంతమునవిడిచితివి. సాధ్వీరత్నమైన యీయామె నాచే రక్షింపఁబడియె. ఈకవలలు నీకుమారులు. ఇనకులవీరా! నావాక్యములు సత్యము నేను మనస్సునందైనను బొంకఁదలంపను ధరణిజ దుష్టచిత్తయేనిఁ బెక్కువేల వర్షంబులనుండి నేజేసిన దపస్సు దగ్ధమగును. మనస్సుచేతను, గర్మలచేతను, వాక్కుచేతను గలుషములు నేనెప్పుడుపలుకను. భూసుత పాపరహితయని దివ్యదృష్టినెఱింగి యీయామెనురక్షించితిని. బతివ్రతలకు మేల్బంతి అతి పవిత్రశీల. జనవాక్యంబులకువెఱచు నీకు నమ్మికగలుగ జేయుటకు బాసచేయును. దివ్యదృష్టిచేత సీత భవ్యాత్మయని యెఱింగితిని. జనదూషణభరింపలేక పడతి పరిశుద్ధయని యెఱింగి యు ఘోరాటవిని విడనాడితి"వను వాల్మీకివచనంబులు రామచంద్రుఁడువిని జనమధ్యంబునన్ను సీతనుజూచి విచారమనస్కుడై మునీశ్వరున కిట్లనియె, "మహాత్మా! మీయొక్కవచనంబుల నమ్మితిని. నామనస్సునందుసందియమెంతమాత్రములేదు. ధరాతనూభవ యకల్మషయని మున్నగ్నియందుఁ జొచ్చినప్పుడు దేవతలందరు వచింప గేహమునకుఁ దెచ్చితిని. భూజాత పూత

చరితయని యెఱంగియు లోకాపవాదచే విడువవలసివచ్చె. మునీశ్వరా, క్షమింపుఁడు. భూవలయంబున సీత పూతచరిత్రయని తెలియవలయు" నన్న దశరథతనయుని యభిప్రాయమెఱిఁగి, "అమ్మా, రాముని యభిప్రాయము చొప్పున నీసతీత్వము లోకమునకు వెల్లడింపు"మని వాల్మీకి పల్కెను. సీతశపథము వినుటకు బ్రహ్మేంద్రాదులు నప్సరసలు గంధర్వులు నాదిత్యులు మొదలగు దేవతలందఱు మింటనిల్చి చూచుచుండిరి. సీత కరంబులుమోడ్చి శిరంబువాల్చుకొని, "నిందావాక్యము లాడినటువంటి పౌరులారా! రామచంద్రా! నాశపథమాలకింపుఁడు. నాప్రాణేశ్వరుండైన రాముని పాదపద్మంబులే యెల్లప్పుడు నామనస్సునందుఁ దలఁతునేని రామచంద్రునిపల్కులు జవదాటియెఱుఁగని సాధుశీలనేని రామనామము మఱువక నిత్యము ధ్యానించుదాననేని లోకనింద నాపై పోవుటకు నిదర్శనముగా వర్షము గురియుఁగాక"యను వచనంబులు సీతనోటి నుండి వచ్చినతోడనే ప్రకృతియంతయు నొక్కపెట్టున సంచలితమై పంచభూతంబులు మహాసాధ్వియైన సీతను బరీక్షింతురా యని క్రోధావేశమున గలతజెందెనో యనునట్లు తమ తమ ప్రభావంబును బ్రకటింపసాగెను. భూదేవి తనకుమార్తెయగు సీతాదేవిపై వచ్చిన వాదు సహింపఁజాలక గగ్గుఱుపాటుఁ జెందెనో యనునట్లు కంపమునొంది యటనిలిచిన బ్రజాసమూహము నిటు నటు నూపసాగెను. పైనుండి పుష్కలావర్తములు జగత్ప్రళయమో యనునట్లు కుంభవృష్టిఁ గురియసాగెను.

ఆకసంబంతయు గారుమబ్బులచే నిండియుండి చీకట్లుగ్రమ్మ నందు విద్యుద్దీపములవలె మెఱపులు మెఱయసాగెను. ప్రభంజ నుండుగ్రరూపంబుధరించి వృక్షములఁ బెల్లగించి యాటబంతుల వలె నచటి ప్రజలమీఁది కెగురవేసెను. ఆకసమురుముల తోడను, మెఱపులతోడను పిడుగులతోడను సంచలితమై భయంకరాకారముఁ దాల్చియుండెను. అచటిప్రజలు జగత్ప్రళ యమని భయపడసాగిరి. సీతామహాసాధ్వి ప్రభావముదెలియక పరీక్షించుట కొడంబడిన కారణమున నిట్లు జగత్ప్రళయము గలిగెనని, "లోకమాతా! జననసుతా! సీతా! నీసత్వశీలముఁ దెలియక మాయాప్రేరితుఁడై న నొకరజకుండు వివేకహీనుండై పలికిన పలుకులకు తామసమంది నీప్రకృత్యుగ్రతఁ జూపించిన యెడల ప్రపంచకము నిలువగలదా? నీప్రభావము బరీక్షింప మేమెంతవారము. తల్లీ! మన్నింపు"మని యచటిప్రజలామెను ప్రార్థింప ప్రకృతిస్వరూపమైన సీతాదేవి పరాత్పరుఁడైన యా పురుషోత్తముని ధ్యానించి, మనసు నాతనిలో నైక్యముచేసి "నేనే నాప్రాణనాథుని నిశ్చలభక్తితో సేవించుదాననైన నీప్రకృతి శాంతించుగాక"యని ప్రార్థించినతోడనే పంచభూత ములు శాంతినిబొందెను.

దేవతలు దివినుండి పుష్పవర్షముఁ గురిపించిరి. పిమ్మట రామచంద్రుఁడు జానకితోఁడను గుమారులతోఁడను గలసి సర్వసౌఖ్యముల ననుభవింపుచు నానందసాగరంబున నోల లాడుచుండెను.

శ్లో॥ నమోస్తురామాయసలక్ష్మణాయ।
నమోస్తుదేవ్యై జనకాత్మజాయై।
నమోస్తువాతాత్మ భువేవరాయ।
నమోస్తువల్మీక భవాయతస్మై॥

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరామార్పణమస్తు.



శ్రీఆనంద తీర్థ ముద్రాక్షరశాల, రామచంద్రపురము.

